Photo by A. L. Syed



బహుమతి పొందిన వ్యాఖ్య

ముద్దుల మూట

పంపినవారు: అద్దంకి వెంకటేశ్వరరావు - ఏలూరు


ఫిబ్రవరిలో
విడుదల!
భాస్కర్ ప్రొడక్షన్సు చిత్రం
బ్రతుకు తెరువు
డైరెక్షన్
రామకృష్ణ



# డోంగ్రేగారి

## బాలామృతం

బలహీనమైన బిడ్డలకు పుష్టినిచ్చి, పండ్లు మొలిచేటప్పుడు అయ్యే విరేచనములు నిలిపి, బలమును ఆరోగ్యము నిచ్చును.

K. T. Dongre & Co., BOMBAY-4

---

DISCOUNT 25%

# జగత్ అట్లాసు (తెలుగులో)

## JAGAT ATLAS IN TELUGU

with Geography useful notes

దీనిలో ఇండియా, పాకిస్థాన్ల మ్యాపుల తోబాటు, యితర ముఖ్యదేశాల పటములు, వాతావరణ, భౌతిక సంపదలను చూపు పటములు జేర్చబడి యున్నవి.

ప్రతి వెల: రు. 1–0–0

ముఖ్య వివరణలతో రు. 1–8–0

**In English Language**

NEW RASHTRIYA ATLAS Geographical and Historical coloured with useful Notes ... Rs. 2-8-0

Jagat Atlas in Hindi with useful Notes ... Re. 1-5-0

Maps and Alphabet Chart in Tamil, Telugu, English, Hindi, Malayalam, Kannada and Urdu available. Price As. 8 each. Please write in English to:

**Indian Book Depot,**
**Deputy Ganj, Delhi.**

---

మిశ్రమ లోహముపైన బంగారురేకు అతికించి తయారు చేయబడిన రాజా ఆభరణములు 10 సం॥ గ్యారంటీ




2·2" సైజు మిరియం, వంకీ, డిజైనుల గాజులు జత 1 కి రూ. 7-0-0.
అడ్వరుతో అన్ని ఆభరణముల కేటలాగు పంపబడును. పోస్టేజి 1-0-0 అదనము.

రాజాగోల్డు కవరింగు కంపెనీ (రిజిష్టర్డు)
రాజాబిల్డింగ్సు :: మచిలీపట్నం.

---

# పాఠకులకు మనవి



పైనెల చందమామ కాపీలు యీనెల చివరివారంలో పోస్టు అవుతవి. సకాలంలో అందనివారు, వారి పోస్టాఫీసులో ఫిర్యాదు చేస్తూ, వెంటనే మాకు తెలియపర్చ గోరుతాము.

చందమామ పబ్లికేషన్స్

# చందమామ

సంచాలకుడు:
'చక్రపాణి'

ఈ సంచికలో మీరు 'వినోదం', 'విదేశాల వింతలూ' చదివేవుంటారు. ఇవిగాక - 'బదులు చెప్పు' అనేది బుద్ధిబలాన్ని పరీక్షించే కొత్త శీర్షిక. ఇది మీకెలా నచ్చిందీ వ్రాస్తారుకదూ? తరువాత - ఫొటోవ్యాఖ్యల పోటీలో ఎక్కువమంది పాలొనటంచూచి చాలా ఉత్సాహపడుతున్నాము. అయితే ఈ సందర్భంలో రెండు మాటలు: మీ జవాబులు ఫొటోల పైలక్షణాలనుబట్టేగాక, ఫొటోలు రెండిటినీ జతకూర్చిన వుద్దేశం ఏమైవుంటుందో యోచించి, మరీ వ్రాయాలి. మచ్చుకి ఈ నెల— వేలసంఖ్యలలో మాకు చేరిన వ్యాఖ్యలలోకెల్లా ఆలోచనతో వ్రాసినవి రెండున్నవి: 1. జోగి - జోషి అనేది, 2. లేమిబాధ - కలిమిగాథ అనేదిన్ని. బాగున్నది చివరిదే గనుక, బహుమతి పొందింది. ఇంకొక్క మాట—పోటీ కోసం పేజీ అంతా చింపవద్దు. కూపన్‌మటుకు చించి పంపితే చాలు. పూర్తి చేసిన కూపను బుక్‌పోస్టుగా పంపండి. రెండణాల కవరు అనవసరం.

సంపుటి 12 :: ఫిబ్రవరి 1953 :: సంచిక 2

SANKAR...









# ముళ్ళూ - పూలూ

అనగనగా ఒక ఊళ్ళో
ఇద్ద రప్పచెల్లెళ్ళు.
పడలేదింకా వారికి
ముచ్చటగా మూడుముళ్ళు.

చూపులకా ఇద్దరునూ
అచ్చు పోసినట్లున్నా,
లేదెక్కడ బుద్ధులలో
పోలిక ఒక పిసరన్నా.

పెద్దావిడ ఓర్వలేదు
చూచి ఎవరి మేలైనా.
నోరు మెదపితే పోరే,
కదపదలా కాలైనా.

చిన్నది చాలా నెమ్మది
విసుగుకోదు, విసురుకోదు.
పసిదైనా పనిచెబుతే
రుసరుసమని కసురుకోదు.

మంచినీళ్ళు తెద్దామని
అప్పాచెల్లె ళ్ళిద్దరు,
నూతికడకు కడవలతో
వెళ్ళా రొక మల్లిప్రొద్దున.

వీరి రాక చూచి ఒక్క
దేవత మదిననుకొన్నది—
'వీరిద్దరి గుణంతెలిసి
కొనటానికి తగు అదునిది.'

రచన:
బైరాగి

అనుకొని వెనువెంటనె ఒక
ముసలిదాని రూపంలో,
వచ్చి నిలబడింది బావి
ప్రక్క అతి సమీపంలో.

'దాహం వేస్తోందమ్మా!
చాల ముసలిదాన్ని నేను.
దోసిలిలో నీళ్ళు పొయ్యి,
మరొకచోటి కెళ్ళలేను.'

అని ముసలిది అన్నంతట
పెద్దావిడ కసురుకొంది.
'పోవే, తేరగా నీళ్ళు
పోసే వారెవ్వ'రంది.

కాని చిన్నపిల్లమటుకు
దాహం వెంటనే పోసి,
తృప్తిపరచినది అవ్వను
మిగుల కుశలప్రశ్న లేసి.

అప్పుడు నిజరూపంలో
దేవి వారి ఎదుట నిలచి,
తీర్పు చెప్పినది ఇద్దరి
గుణగణాలు మదిని దలచి.

పెద్దావిడ నోటివెంట
ముళ్ళు రాలతా యంది.
చిన్నావిడ పలికినంత
పూలు కురుస్తాయంది.







# అట్టవిూది బొమ్మ

ఒకప్పుడు కురు పాండవులు కలసి వేటకని అడవికి వెళ్లారు. అక్కడ అర్జునుడికి ఒక జింకా, ఆ జింకను వెంటాడే ఒక వేటకుక్కా కనిపించినై. అతను జింకను తరుముకొనిపోగా, కొంతదూరంలో ఆ జింకా, కుక్కాకూడా మాయమయినై.

మరికొద్దిసేపటికే ఆ వేటకుక్క వేదనపడుతున్న శబ్దం వినవచ్చింది. వెంటనే పోయిచూస్తే, ఆ కుక్క శరీరంనిండా అనేకమైన గాయాలు కనిపించినై. అర్జునునికి జిజ్ఞాస పట్టుకున్నది—'ఒక్క శరంతో ఇన్ని గాయాలు కలిగించగల అద్భుత విద్య నాకూ, నా గురువయిన ద్రోణునికీ తప్ప మరెవ్వరికీ తెలియదే! ఈ రహస్యాన్ని తెలుసుకోగలిగిన ఆ మూడవవాడు ఎవడుచెప్మా!' అని.

పోగాపోగా, ఒక చిన్న గుడిసె కంటబడ్డది. పక్కన ఒక వేటగాడు నిలబడి వున్నాడు. వాని చేతిలో విల్లమ్ములున్నయి.

వాడొక బోయవాడు, పేరు ఏకలవ్యుడు. వాని వికృతాకారం చూచి వేటకుక్క మొరిగితే దానిని కొట్టాడు. ఒకప్పుడు ఏకలవ్యుడు ద్రోణాచార్యుని ఆశ్రయించి విలువిద్య చెప్పమని కోరాడు. ఆయన నిరాకరించాడు. అప్పుడు వాడు ద్రోణుని ప్రతిమను అడవిలో తన కుటీరంవద్ద నెలకొల్పి, ఆ ప్రతిమనే నిజమైన గురువుగా ఎంచి, విలువిద్య అభ్యసించి, స్వయంకృషివల్లనే ఇంతటివాడైనాడట.

అర్జునుడు ఈ సంగతి గురువుకు చెప్పాడు. ఆయన ఆ ప్రదేశానికి వచ్చి చూచి, విస్తుపోయాడు. ఏకలవ్యుడు అతి భక్తితో గురువుకు ప్రణమిల్లాడు.

ఏకలవ్యుడు విద్యనేర్చిన తీరు చూచాడు ద్రోణుడు. 'మరికొద్దిరోజులపాటు వీడు ఇలానే విద్య అభ్యసిస్తే, నా ప్రియశిష్యుడైన అర్జునుణ్ణి మించిన మేటి విలుకాడు ఐతీరుతాడు. అప్పుడు నేను సవ్యసాచికి, 'నిన్నుమించిన ధనుర్ధరుడు ఉండబోడ'ని చేసిన వాగ్దానం తప్పిపోతుందే' అని ఆలోచనలో పడ్డాడు.

"ఏకలవ్యా!–నిన్నుచూడగా నాకు చాలా సంతోషమైంది. మరి గురుదక్షిణ?" అని అడిగాడు. సంతోషంతో ఏకలవ్యుడు 'గురూ!—మీ అనుజ్ఞ!' అన్నాడు. అప్పుడు ద్రోణుడు వాని కుడిచేతి బొటనవేలు ఇమ్మనగా, చర్రుమని కత్తితో తన వేలు కోసి, ద్రోణునికి గురుదక్షిణగా సమర్పించి, ఏకలవ్యుడు ధన్యుడైనాడు.

# పునర్జన్మ

పూర్వకాలమందు, పరమపవిత్రమైనటువంటి పండరిపురంలో కమలాకరుడనే బ్రాహ్మణుడు ఉండేవాడు. ఆయన సకల శాస్త్రవేత్త. ఆయనభార్య సుమతి సద్గుణవతి, భర్తకు అనుకూలవతి. వారికి పద్మాకరుడనే సుపుత్రుడు కలిగాడు.

ముగ్గురూ మంచిభక్తులూ, భక్తులను సేవించటమంటే ఆసక్తికలవారున్నూ. కమలాకరుడు కడుపేద. కనుక, యాయవారం చేసుకుని జీవనయాత్ర సాగిస్తూ ఉండేవాడు.

ఒకరోజున, కమలాకరుడు యాయవారానికని బయల్దేరి వెళుతూవుండగా, దారిలో తుకారాము, నామదేవు, మొదలైన భక్తులు ఎంతోమంది అతనికి ఎదురయ్యారు.

వారినిచూచి కమలాకరుడు బ్రహ్మానంద భరితుడై "అయ్యలారా! ఇవాళ ఎంతటి సుదినం! మీరందరూ ఒక్కమారుగా దర్శన మివ్వటం నా పూర్వపుణ్యవిశేషం తప్ప మరేమిటి? దయవుంచి, ఈపూట మాయింట ఆతిథ్యం స్వీకరించి మమ్మల్ని ధన్యులను చేయండి." అని ప్రార్థించాడు.

అందుకు వారు "ఓయీ కమలాకరా!— నీ ఆదరణకు మేము చాలా సంతోషించాము. కానైతే పాపం, నీకు జరుగుబాటు తక్కువే? నీవే యాయవారంవల్ల కుటుంబకాలక్షేపం చేస్తుంటివే? మేం ఒకళ్లమూ యిద్దరమూ కాము. మా అందరినీ ఎక్కడని భరించగలవు? వద్దులే. తాపత్రయ పడకు. నీ అభిమానమే మాకు పదివేలు!" అని ప్రీతిగా అన్నారు.

ఈ మాటలకు కమలాకరుడు చాలా ఖిన్నుడయాడు. "అయ్యో! ఎంత మాట చెప్పారు. మీరు అన్నట్టు నేను యాయ

నై. మోహనరావు - పార్వతీపురం




వార వృత్తితో కుటుంబపోషణ చేసుకొంటున్న సంగతి వాస్తవమే. ఐతే, నా జననీ జనకులైన రుక్మిణీ కృష్ణులు మహదైశ్వర్య సంపన్నులు. వారి కృప ఉన్నంతవరకూ నాకు ఎటువంటి లోటూ లేదు. కాబట్టి, దయవుంచి మారుచెప్పక, నా మనవి మన్నించి నన్ను అనుగ్రహించండి" అంటూ దీనంగా వేడుకొన్నాడు.

అతనికి భగవంతునియందు గల నమ్మిక చూచి ఆ భక్తులు ఎంతో ఆనందించారు.

"సరే, కమలాకరా!—మేము పోయి చంద్రభాగనదిలో స్నానం సంధ్యా నెరవేర్చుకు వస్తాము. నీవు యింటికి వెళ్ళి తగు ప్రయత్నంచేసి సిద్ధంగా వుండు" అని చెప్పి, వారు వెళ్ళారు.

కమలాకరుడు అపరిమితమైన సంతోషంతో ఇంటికి వచ్చి, ఈ సంగతి భార్యతో చెప్పాడు. సుమతికూడా ఇందుకు సంతోషించింది. తక్షణమే ఆమె తన స్నేహితురాళ్ళ యిళ్ళకి పోయి, పదార్థాలు బదులు తెచ్చి, వంట ప్రారంభించింది.

తీరా వంట పూర్తికాకముందే కట్టెలు ఐపోయినై. అందుచేత, కొడుకును పిలిచి, "నాయనా, పద్మాకరా! కట్టెలైపోయినై. ఆ మూల కాసిని పిడకలు తీసి చప్పున పట్టుకు రా" అంది.

వాడు గబగబ పోయి పిడకలు తీయబోతూవుండగా, ఎన్నాళ్లనుంచో అందులో కనిపెట్టుకునివున్న సర్పం ఒకటి బుస్సుమంటూ లేచి ఆ పసివాణ్ణి కాటు వేసింది. వాడు 'అమ్మా!—' అని ఒక్క కేకవేస్తూ, కిందపడి ప్రాణాలు విడిచాడు.

ఆ కేక వింటూనే తల్లి, ఇవతలకు వచ్చి చూచింది. నిశ్చేష్టురాలయింది. కిందపడి వున్న బిడ్డడి శరీరం తడిమిచూచి, వాడు మరణించినట్టు తెలుసుకుంది. అపరిమితమైన దుఃఖంలో మునిగిపోయింది.

ఐతే—ఇది దుఃఖించవలసిన సమయం కాదు. ఏమంటే, అవతల సాధువులకోసం తలపెట్టిన ఆరాధన నిలిచిపోతుంది. అందుచేత, ఆమె దుఃఖం దిగమింగుకొని, కుమారుణ్ణి ఒకమూల పడుకోబెట్టింది. వంట పూర్తిచేసి, అతిథులు ఎప్పుడు వస్తారా అని ఎదురు చూస్తూవుంది.

ఇంతలో, ఆ భక్తులు స్నానాదికృత్యాలు తీర్చుకుని, భగవన్నామసంకీర్తనం చేసుకొంటూ కమలాకరుని ఇంటికి వచ్చారు.

కమలాకరుడు వారిని అత్యంత భక్తితో వెంట బెట్టుకొని వచ్చి, నివేదన కానిచ్చి, సమాదరంగా భోజనానికి కూర్చోండని అన్నాడు.

భోజనానికి కూర్చునేముందు ఆ భక్తులు 'పిల్లవాణ్ణి కూడా రమ్మనండి' అన్నారు. కమలా కరుడు మిన్నకున్నాడు. వారు దివ్యదృష్టివల్ల అంతా గ్రహించారు. కమలాకరునితో "కుర్రవాణ్ణి పిలవండి, అందరం కలిసి కూర్చుందాం"అన్నాడు నామదేవుడు.

కమలాకరుడు ఆలోచనలో పడ్డాడు. మృతకళేబరం ఇంటిలో వున్నదని నిజం చెబితే వారు భోజనంచేయరేమో! ఎలా? అందుకని వారితో కమలాకరుడు "అయ్యా!



వాడు ఇంతకుముందే భోజనంచేసి పడు కొన్నాడు" అనిచెప్పి తప్పించుకోజూచాడు.

"అలా కాదు. ఆ పసి వాడు పంక్తిని కూర్చుంటే గాని భోజనం చేసేది లేదు" అని పట్టుపట్టాడు, అదివరకే దివ్యదృష్టితో అంతా గ్రహించిన నామదేవుడు.

గత్యంతరం తోచలేదు కమలాకరునికి. కరుణాసాగరుడైన పుండరీకాక్షుణ్ణి ప్రార్థించాడు. అప్పుడు భగవానుడు ప్రత్యక్షమై "భక్తా,-నీకేమి కావాలి ?" అని అడిగేసరికి, కమలాకరుడు "దేవా!—నా యింటికి మహానుభావు లెందరో అతిథులుగా వచ్చి ఉన్నారు. నా కుమారుడు పంక్తికి వస్తేకాని వీలులేదని వారు పట్టుపట్టారు. కుర్రవాడికి చూడబోతే, యిటువంటి అవాంతరం వచ్చిపడింది. దయామయా! కార్యం విఘ్నంకాకుండా, ఆ అతిథుల భోజనాలు అయ్యేవరకూ కుర్రవాడిని బతికించు స్వామీ! ఇదే నా కోరిక" అన్నాడు.

శ్రీహరి 'సరే, నీకోరిక నెరవేరుతుందిలే' అనిచెప్పి అంతర్ధానమయ్యాడు. ఆ వెంటనే పద్మాకరుడు నిద్రనుండి తెలివి వచ్చినవాని లాగా లేచికూర్చుని 'అమ్మా! దాహం ...' అంటూ, సరాసరి ఆ భక్తులు కూర్చున్న చోటికి వెళ్లాడు.

సుమతి ఆనందంతో వాడిని కౌగిలించుకుని, "అయ్యలారా! మీ అనుగ్రహంవల్లనే నా పసివాడు మళ్లీ బతికిలేచాడు. మీరే భగవత్స్వరూపులు. మీలో ఉన్న భగవంతుడే నా బిడ్డను బతికించాడు."అని అనేకవిధాల తన సంతోషాన్ని వెల్లడించింది.

అప్పుడు సుగుణరాశి ఐన పద్మాకరుణ్ణి పంక్తిని కూర్చోబెట్టుకుని ఆ సాధువులు ఆనందంతో భోజనాలుచేశారు. వారు భక్త శిరోమణి ఐన కమలాకరుని ఎంతగానో వినుతించి, ఆ ముగ్గురికీ కూడా పరమ పవిత్రమైన తారకమంత్రం ఉపదేశించి, తరణోపాయం చూపి, మరలిపోయారు.






## 4

అప్పుడు రోజుకొంటూ వచ్చాడు ఒక సేవకుడు. "ప్రభూ!—కిరాతరాజూ, అర్ధకర్ముడూ చచ్చిపోయారు" అని చెప్పాడు.

ఈ మాట వింటూనే, "చచ్చారూ? వదిలింది పీడ!" అన్నాడు రాజగురు ఏదో పెద్ద భారం దిగిపోయినట్టుగా. "ఆ క్రూరవెధవనికూడా వెతికిపట్టండి!" అంటూ హెచ్చరికకూడాచేశాడు. అంతలోనే, యుద్ధరంగంనుంచి ఆ రెండు కళేబరాలనూ సిపాయిలు మోసుకువచ్చారు.

రాజగురు అలా అన్నందుకు మందపాలుడు మనసులోనే చాలా ఖేదపడ్డాడు. కాని ఏమీ అనలేకపోయాడు. తండ్రి మరణానికి ఎంతగానో దుఃఖించాడు. ఇది కనిపెట్టాడు రాజగురు. మందపాలునికి తిరుగా తండ్రిపైన మమకారం కలగటం చూచి, అతనికి వానియందు వెంటనే విరక్తభావం పొడమింది.

ఈ వార్త చెవినిపడిందే, చెరలో వున్న ప్రమోదుడు కూలిపోయాడు. అర్ధకర్ముని భార్యకు స్మృతి తప్పింది.

యుద్ధఫలితంగా వచ్చిన మరణవార్తలకు సామంతులందరిలో విలపించినవాడు అమరభూపతి. ఏమీ?—కన్నకూతురా చెరలో వుండె! కసుగందు కనపడకుండాపాయె! అల్లుడు అర్ధాంతరంగా చచ్చె! ఇంకేంకావాలి ఇంతకంటె?

తీరని దుఃఖంలో మునిగివున్న అతను పట్టాభిషేకంలో పాల్గొనేదేమిటి? అయినా, నలుగురితోపాటు ఉండక తప్పిందికాదు. అతని శరీరమే వున్నది కాని, మనస్సు అక్కడ లేనేలేదు.




ఏమయితే కానీ అని, చకచకమంటూ పట్టాభిషేకపుఏర్పాటులు చేయసాగాడు, రాజగురు. ఈ సందడిలో మగధరాజ్యం నుంచి ఒక సేవకుడు, అమరభూపతి తండ్రి చనిపోయిన వర్తమానం తెచ్చాడు.

కష్టాలపైన కష్టాలు వచ్చిపడినందుకు దుఃఖించాడు అమరభూపతి. మందపాలునివద్ద, రాజగురువద్ద సెలవుతీసుకొని, తక్షణమే తన రాజ్యానికి మరలిపోయాడు. కాని మనస్సంతా మనుమని మీదనే వున్నది!

లాంఛనప్రాయంగా మందపాలునికి పట్టాభిషేక మహోత్సవం జరిగిపోయింది. ఎవళ్ళ యిళ్లకు వాళ్లు వెళ్ళిపోయారు.

పట్టాభిషేకం జరగటం ప్రజలకేమంత యిష్టతగా కనిపించలేదు. ఆ కారణంగా భల్లాణరాజ్యంలో గొప్ప మార్పు వచ్చింది. ఏమి అంటే: ఇప్పుడీయుద్ధం కేవలమూ అధర్మయుద్ధమని అందరకూ తెలియటం- ప్రమోదుడూ, అర్ధకర్ముని భార్యా బందీలై వుండటం - ఎక్కడినించో వచ్చిన మంద పాలుడు గద్దె యెక్కటం - వీటన్నిటికేమి ?- నిరపరాధి ఐన అర్ధకర్ముడూ, వానిని కని పెట్టుకునివున్న కిరాతరాజూ మరణించటం, —పాపం! పసివాడు, చిత్రభానుడు కనిపించకపోవటం—ఇవన్నీ ప్రజకు సహించరాని విషయాలయినై.

"మా మారాజును విడిచిపెట్టండీ! మా పట్టమహిషిని విడిచిపెట్టండీ! ప్రమోద మహారాజే మాకు ప్రభువుగా వుండాలి!" అంటూ వాళ్లు గగ్గోలుపెట్టారు.

మందపాలుడేమీ మాటాడలేకపోయాడు. రాజగురే ప్రజను సముదాయించటానికి యత్నించాడు. అంతేకాదు, వారి ఉద్దేశానికి అనుకూలంగా దండోరాకూడా వేయించాడు. కాని, అదెవళ్లూ చెవినిపెట్టలేదు. దానిపైన రాజగురు ఉగ్రుడై, ప్రజను హింసింపసాగాడు. కాని ప్రయోజనం లేకపోయింది.

ఇంకిప్పుడు—హింసామార్గంవల్ల ప్రజను దారికి తీసుకరాలేము, అని రూఢిచేసుకొన్నాడు రాజగురు. అయితే, మరి ఎలా లొంగదీయటం అని యోచించి, 'ఒక ఏడేళ్ళవరకూ ఏవిధమైన పన్నులూ మీరు కట్టనక్కరలేదు' అని అంటే, చచ్చినట్టు ప్రజ మన దారికి వస్తారుకదా అని నిశ్చయించుకొన్నాడు. అయితే, ఆ ఏడేండ్లూ రాజ్యాంగాన్ని నిర్వహించటం ఎలా? భల్లాణరాజ్యపు ఖజానా యుద్ధంవల్ల ఖాళీ ఐపోయిందే? ఏంచేసేది? బాగా ఆలోచించి, రాజగురు వెంటనే ఒక తాఖీదు ఇలా సామంతరాజులందరికీ పంపించాడు:




"మీరు నిష్కారణంగా ప్రకటించిన ఈ యుద్ధంలో భల్లాణరాజ్యప్రజ ఎక్కువగా నష్టపడి, నలిగిపోయారు. వారిని కాపాడటం ప్రభువులమైన మాకూ, మా సామంతులైన మీకూ విధి అయివున్నది. ఏడేళ్ళవరకూ ప్రజనుండి పన్నులేమీ వసూలుచేయకూడదనీ; మన రాజ్యం మామూలుస్థితికి వచ్చేవరకు అవసరమైన సదుపాయాలన్నీ, వారికి చేయాలనీ నిశ్చయించాము. ఈ పని కొనసాగాలంటే మీరందరూ చాలా తోడుపడాలి. ఇప్పుడు జరుగురుగా ఈ సమయంలో, ఖజానాకు చేరవలసిన కప్పము రెండింతలుగా కట్టడం మీరు చేయవలసిన మొట్టమొదటి సాయం..." అని ఆ తాఖీదులో వ్రాసిఉన్నది.

తాఖీదు చూడగానే సామంతులందరూ చేరి ఘూర్జరరాజు పెద్దరికంకింద సమావేశమయ్యారు. ఉన్న మారాజును వదులుకుని, లేనిపోని కష్టాలు కొనితెచ్చుకున్నామే అని వారు చాలా విచారించారు. ఎంత చర్చించినా, ఫలితం తేలలేదు. చివరకు వారు అమరభూపతిని కలుసుకొని యోచించారు. అనుభవజ్ఞుడైన అమర




భూపతి మంచిచెడ్డలూ, ముందువెనుకలూ బాగా యోచించి—

"ఇప్పుడు మనం ఓర్పు వహించవలసిన పరీక్షాసమయం. మనం ఏపాటి ఉద్రేక పడినా, ఏంచేసినా ఆ రాజగురు ఆధీనంలో వున్న ప్రమోదుడికీ, అర్ధకర్ముని భార్యకూ ప్రమాదం కలగవచ్చు. రాజగురు బహు క్రూరుడు. ఏపనికైనా వెనుదీయడు. కనుక, ఈ పరిస్థితిలో వాడు ఎటువంటి హింసలు పెట్టినా అణిగిమణిగి వుండటమే మంచిది. ఇప్పుడు మనం ఆ పసివాణ్ణి ఎలా అయినా వెతికితెచ్చి కాపాడుకోవటం ముఖ్యం" అంటూ సలహా చెప్పాడు.

సామంతరాజులకు ఈ మాటలన్నీ బాగా నచ్చినై. కొంతమంది వెంటనే పసివానిని వెదకటానికని గుర్తులు చెప్పి చారులను నలుదిక్కులా పంపించారు.

అతని సలహాను అనుసరించి సామంతు లందరూ ఇలా ప్రత్యుత్తరం వ్రాసి పంపించారు: "మీరు వచ్చి మాకు బోధించిన హితవులన్నీ అక్షరాలా శిరసావహించాము. మాకు యుద్ధంకొరకు చాల ఖర్చులయినై. రత్నకిరీటం లేని రాజులకు కప్పము కట్ట నక్కరలేదని చెప్పగా, నిజమేననుకొని నమ్మి, అప్పుడు అలా జవాబు వ్రాశాము. జవాబుకు ప్రతిఫలంగా వచ్చిన యుద్ధంలో పాల్గొని, కష్టనష్టాలకు పాల్పడ్డాము. ఇప్పుడింతలోనే మీ మనసు ఇలా మారిపోతుందని మేమెన్నడూ తలచలేదు. యుద్ధరంగం నుండి ఇంటికి చేరకముందే కప్పము కట్టాలెనని శాసిస్తారనీ, అదీ రెండింతలుగా కట్టమంటారనీ కలనైనా వూహించలేక పోయాము. భల్లాణరాజ్యం మీకు హస్తగత మైనదే, వాగ్దానంచేసినట్టుగా మాకేవో స్వర్గ సౌఖ్యాలు కలుగుతవని ఆశించాముకాని, ఇటువంటి కఠినశిక్ష విధిస్తారని అనుకో లేదు. మా కష్టనిష్ఠురాలు విన్నవించు

శుందామనుకొన్నా, ఇప్పుడు మీరు అలో చించేటంతటి స్తిమితంలో ఉన్నట్టు తోచ నందున, ఇక విరమిస్తున్నాము."

సామంతుల ప్రత్యుత్తరం చూచి, రాజ గురు ఏమనటానికీ వీలుకాలేదు. "నా మంత్రమే నాకు బెడిసికొట్టిందే! నే చెప్పిన ఉపాయాలే నాకు భస్మాసుర వరాలుగా పరిణమించినయే!!" అని వలపోసి, మళ్ళీ తీవ్రమైన యోచనలో పడ్డాడు.

అటు ప్రజల ఘోష! ఇటు సామంతుల దూషణ! గట్టిగా ఒత్తిడిచేస్తే ఎక్కడ యుద్ధానికి వస్తామంటారో అన్న భయంచేత వాళ్ళని ఏమీ అనలేకపోయాడు. ఏమిచెప్పి నమ్మించుదామన్నా, ముసలిరాజునూ, అర్ధ కర్మని భార్యనూ వదిలితేకాని ప్రజ ఊరు కొనేట్టులేదు. విడిచిపెట్టితే కథ అడ్డంతిరుగు తుందాయిరి. ఎలా? ఇందులో ముందు ఒక అవాంతరమైనా దాటితేకాని వీలులేదు. అప్పుడు మెరపులాగ ఒక యోచన తట్టింది. అయితే, తనతో మందపాలుడు ఏకీభవిస్తాడనే నమ్మకం లేకపోయింది.

కొడుకును చేరబిలిచి, రాజగురు తన మనసులోని వ్యూహం వెల్లడించాడు. కొడుకు వెంటనే అమోదించాడు. అంతేకాదు, ఈ




వ్యూహమే నెరవేరినట్టయితే, తనకు చిర కాలంనుంచి గల కోరిక - భల్లాణరాజ్య సింహాసనాన్ని ఆక్రమించటం - ఇట్టె తీరిపో గలదనికూడా చెప్పాడు.

కొడుకు ఈ అభిలాషను వెల్లడించగానే రాజగురు మనసు అతిచిత్రంగా మారి పోయింది. ఇందుకు తోడు, సేవకులు తిరిగి వచ్చి చెప్పిన మాటలనుబట్టి చిత్రభానుడు చచ్చేపోయాడని తెలియవచ్చింది. కాగా, మందపాలుని అవలకు నెట్టివేసి, కొడుకునే గద్దె యెక్కించుదామన్న ఆశ అంకురించి, వృద్ధికాజొచ్చింది. తండ్రికొడుకులు ఇద్దరూ ఒకటై, ఆలోచనలో పడ్డారు.




మరునాడే తమ పన్నాగం అమలు జరుపుదామని కట్టుడిట్టాలన్నీ చేశారు. 'నే నక్కడనే వుండి స్వయంగా యేర్పాటులన్నీ చూస్తాగా!' అని తండ్రికి ధీమా చెప్పాడు, పిన్నవాడు. కొడుకు తెలివితేటలకూ, ధైర్యసాహసాలకూ రాజగురు లోలోన సంతోషించాడు. ఇంకేమున్నది? తన ముద్దులకొడుకు భల్లాణ రాజ్య సింహాసనంపై కూర్చునివుంటే కళ్ళ వేడుకగా చూడటం రోజులలో పనేకదా, అని పొంగిపోయాడు.

తండ్రి కొడుకులు అనుకొన్నప్రకారం, ఆనాటి రాత్రి—



రాజగురు కొడుకు పనివాళ్లను రప్పించి, అద్భుతమైన సాధనాలేవో యిచ్చి, కారాగారానికి నిప్పుముట్టించమని ఆజ్ఞాపించాడు. ఏయే తావులు ముందుగా అంటుకోవాలో చెప్పాడు. పైగా, ముట్టించవలసిన సమయం కూడా చెప్పాడు. ఇదంతా ఎవళ్ళకూ తెలియదు! అనుకొన్నకంటె ముందుగానే నిప్పంటుకుంది. చూస్తూవుండగానే మంటలు యెగసివచ్చినై. అప్పుడు అక్కడకు వచ్చిన రాజగురు కొడుకునకు అకస్మాత్తుగా సంశయం కలిగింది. ప్రమోదుడి గది అంటుకున్నదా, లేదా? అర్థకర్మనిభార్య వుండే గది ఆహుతి అయిందా, లేదా? ఈ వేగిరపాటుతో అతను ఆ రెండు గదులవద్దకూ గబగబమంటూ పోబోయాడు. కాని, అంతలోనే మండుతూవున్న దూలం మీద పడింది!

చూడబోతే, నగరమంతా గోలగోల! కంగారుతో లేచారు ప్రజలు. అటు ఇటు పరుగులెత్తారు. కాళ్ళూ, వళ్ళూ కాల్చుకున్నారు. యేకధారగా ఏడ్చారు. పెడబొబ్బలు పెట్టారు.

ఈ యేడుపులేమీ లక్ష్యపెట్టలేదు అగ్నిదేవుడు. తన పని తను చేసుకొనిపోతూనే





వున్నాడు. అప్పుడే జ్వాలలు ఆకాశానికి అంటుతున్నవి. రాత్రి పగలుగా వెలిగింది!

కాస్త నిబ్బరం కలవాళ్లంతా నీళ్లుమోసి అగ్గి ఆరుపబోయారు. యిసుక తెచ్చి పోయ సాగారు. ధైర్యవంతులు చొరుచుకుపోయి, వీలైనంతవరకు, కారాగృహపు గదుల తాళాలు పగలగొట్టి లోపలివాళ్లను బయటికి తీసుకువచ్చారు.

అంతలో ఈ వార్త కోటలోకి ప్రాకిపోయి మందపాలుడుకి తెలిసింది. కలవరపడ్డాడు. 'ఏమీ ఈ ఘోరం! యెవరుచేసిన పని? ఈ ప్రమాదంలో, అర్ధకర్ముని భార్యగాని చచ్చిపోదుకద! నేనే కుట్రచేసి చంపా నని ప్రజలు అనుకొని ఎదురుతిరగరు కద! ఇప్పుడున్న పరిస్థితులలో ఇటువంటి నిందలు నెత్తిన పడటమూ పెద్దపనికాదు!' అనుకొంటూ, ఉన్నవాడున్నట్టుగానే కారా గారానికి పరుగెత్తాడు. ఎంతమంది వద్దన్నా అగక సాహసించి, లోపలకు దూరాడు. ప్రమోదుడు బంధింపబడిన గదితాళాలు పగలగొట్టి, మరుక్షణంలోనే ప్రమోదుణ్ణి బుజాలపైన వేసికొని బయటకి వచ్చాడు. తిరిగి వెళ్ళి, అర్ధకర్ముని భార్యఉండే గది పగలగొట్టి చూచాడు. అమె మసిబారి చచ్చిపడివున్నది! ఇది విని అందరూ గొల్లుమన్నారు! ఈవార్తవిన్న ప్రతివాళ్లకూ లోకమే చీకటిగా తోచింది!

తాళం బిగించివుండటంవల్ల తప్పించు కుందామన్నా ఆమెకు వీలుకాలేదు.

ఘోరం! దుర్భరం! ఇంకా యెంతో మంది తక్కిన గదులలో చచ్చిపడివున్నారు.

అంతలో రాజగురు అక్కడికి వచ్చాడు! మంటలు చూచాడు. మతిపోయినట్టుగా కారాగారమంతటా కలియదిరిగాడు. తల వనితలంపుగా దూలంకింద తన కొడుకు చచ్చి పడివుండటం చూచి, స్మృతితప్పి అక్కడనే సోలిపోయాడు!

తల్లిని విడిచిపోయిన చిత్రభానుడికి 'మిత్రానందు'డనే ఒక మహాఋషి దర్శనమయింది. ఆ మహర్షి యెవరో కాదు. ఆనాడు ప్రమోదమహారాజుకు ఫలం మంత్రించి యిచ్చిన సిద్ధుడే!

మిత్రానందుడు మహాయాగం ఒకటి తలపెట్టాడు. సంకల్పసిద్ధికోసమని శిష్యబృందంతోసహా, భల్లాణరాజ్యానికి సమీపంలోనే ఒక అరణ్యమందు ఇప్పుడు ఉనికి యేర్పరుచుకొని వున్నాడు.

యాగాన్నిగురించిన ప్రయత్నంలో బయలుదేరి పోతూవుండగా, అదృష్టవశాత్తు ఈ చిత్రభానుడు తారసపడ్డాడు. చూస్తూనే ఆయన, దివ్యదృష్టివల్ల పసివాని పుట్టుపూర్వోత్తరాలు తెలుసుకొన్నాడు. 'అబ్బాయీ!—ఆ మాసిపోయిన పైగుడ్డ విప్పి, అవతల పారవేసెయ్యి' అన్నాడు. వెంటనే వానిని తనకూడా ఆశ్రమానికి తీసుకపోయాడు.

మిత్రానందుని శిష్యకోటిలో చేరినప్పటి నుంచీ చిత్రభానుడు అతిచురుకుగా అంచీల మీద విద్యలన్నీ అభ్యసింపసాగాడు. సమస్త శాస్త్రాలూ నేర్చి గురువుకు ప్రియశిష్యుడైనాడు. మిత్రానందుడు వానిని ఎంతో ఆదరంతోనూ, అభిమానంతోనూ చూస్తూ, తగినవాళ్లచేత గుర్రపుస్వారి, విలువిద్య మొదలయినవన్నీ నేర్పించి, గొప్ప ప్రవీణునిగా తయారు చేశాడు.

ఈవిధంగా చిత్రభానుడు పది సంవత్సరాలపాటు మిత్రానందుని ఆశ్రమంలో ఉండేసరికి, అతడొక శూరునిగా, వీరునిగా రాణించే లక్షణాలన్నీ వానిలో కనబడినై.

బాగానే వున్నదింతవరకు. అయితే— పాపం, పసివాని విషయంలో గట్టిచిక్కు ఒకటి తటస్థించింది. అతని విద్యాభ్యాసమయితే దిగ్విజయంగానే పూర్తి అయింది. సమస్తశాస్త్రాలలోనూ ప్రవీణుడయ్యాడు.

కాని— [ఇంకా వుంది]






పూర్వం కూనవరం అనే గ్రామంలో కయ్యాలకామాక్షి అనే పేరుగల ఒకామె వుండేది. కారణం లేకుండానే గ్రామంలో ప్రతివారిమీదా కవ్వించి కాలుదువ్వడం, నానాతిట్లూ తిట్టడం, ఆమెకు నిత్యకృత్యం ఐపోయింది.

ఒక రోజున గ్రామపెద్దలందరూ చేరి, మహాలక్షమ్మ చెట్టుకింద సభతీర్చి, కయ్యాల కామాక్షిని వూళ్లో లేకుండా చేయాలని ఒక నిర్ణయానికి వచ్చారు. ఇందుకోసం కొంతడబ్బు పోగుచేసి 'కయ్యాల కామాక్షిని తిట్లాట - పోట్లాటల్లో ఓడించిన వారికి గొప్ప బహుమాన మిస్తాం' అంటూ చాటింపు వేయించారు.

బహుమతి వస్తుందంటే చాలామందికి ఆశ కలిగింది. కాని ఒక్కళ్లకుకూడా కయ్యాల కామాక్షితో తిట్లాట-పోట్లాటల్లో గెలవగలమనే ధైర్యం లేకపోయింది.

ఆ గ్రామంలోనే బాలయ్య అనే ఒక బీదవాడు వున్నాడు. అతనికి ఒకకొడుకూ, కోడలూ వున్నారు. కోడలి పేరు కనకం. వయసులో చిన్నదైనా మంచి తెలివితేటలు కలది. కయ్యాల కామాక్షిని గురించిన చాటింపువిని తను పోట్లాటలో ఆమెను ఓడించగలనని భర్తతో చెప్పింది.

కనకం చెప్పిన ఈ మాటలు విని అతను చులకనగా నవ్వాడు. నవ్వి, భార్యతో "కయ్యాల కామాక్షి గయ్యాళితనానికి గ్రామం గ్రామమే హడిలిపోతూ వుంటే చిన్నదానివి, నీవల్ల నేమౌతుంది? లేనిపోని గొడవ పడకు. వూరుకో" అన్నాడు.

కాని కనకం పట్టుపట్టింది. కయ్యాల కామాక్షిని ఇట్టే ఓడిస్తానని ఈసారి తన మామ బాలయ్యతో చెప్పింది. చాలాధనం బహుమానంగా వచ్చే వీలుకూడా వుంది

జి. ఆర్. నాగభూషణం - గుంతకల్




కనుక, బాలయ్య సరే అనక తప్పిందికాదు, ఇష్టంవున్నా లేకపోయినా.

ఐతే కయ్యాలకామాక్షితో కయ్యానికి తల పడడం ఎక్కడ, ఎట్లాగ? అన్న సమస్యలు ఎదురయినై. దానికి కనకం ఒక వుపాయం చెప్పింది.

ఊరిపక్కనే పారుతూన్న ఏటివొడ్డున ఒక పడవలో తాను నిలబడతాననీ, తనకు ఒక పాతచెప్పూ, ఒక చీపురుకట్టా యివ్వ వలిసిందనీ కోరింది.

అలాగే ఏర్పాట్లు జరిగాయి. ఏటివొడ్డునే ఒక పడవలో కనకం నిలబడింది. ఎడమ చేతిలో ఒక పాతచెప్పూ, కుడిచేతిలో చీపురూ పట్టుకుంది. ముఖం కనబడీ కన బడనట్టు చీరచెంగుతో కప్పుకొన్నది.

కయ్యాలకామాక్షితో కొందరు యీవార్త చెప్పారు. 'ఆఁ! నాతో పోట్లాటకి తలపడే మనిషనేది యీలోకంలో వుందా? చూస్తాలే దాని సంగతి. ఆఁ-అంత పొగరా?" అంటూ కామాక్షి ఏటిడగ్గిరకు బయలుదేరింది.

అరగంట సేపటికల్లా ఏటికట్టమీద వంద లాది జనం పోగయ్యారు. వేడుక చూసేం దుకు వచ్చినవాళ్ళూ, యీదెబ్బతో కయ్యాల కామాక్షి శని విరగడవుతుందన్న ఆశతో వచ్చినవాళ్ళూ, కనకాన్ని చూసేసరికి ఆశ్చర్యపోయారు.

"ఈ చిన్నమ్మాయి, ఆ గండు ముసలి దానితో ఏం పోట్లాడగలుగుతుందీ?" అన్న అనుమానం అక్కడ పోగైన ప్రతివొక్కరికీ కలిగింది. కయ్యాలకామాక్షి గొంతెత్తి తిట్టడం ప్రారంభించింది. 'ఎవతెవే నువ్వూ? నాతో తిట్లాట-పోట్లాటల్లో పోటీకి వచ్చావట!' అంటూ నానాతిట్లూ తిట్టసాగింది.

కనకం పడవలో నిలబడి నోరెత్తకుండా తన కుడిచేతిలో వున్న చీపురు కయ్యాల కామాక్షికేసి చూపింది. దానితో కామాక్షికి మరింత రోషంకలిగి అడ్డమైనతిట్లూ తిట్టడం

మొదలుపెట్టింది. కనకం నోరు మెదప కుండా అన్నితిట్లకూ, ఓమారు పాతచెప్పూ, మరోమారు చీపురూ కామాక్షికేసి చూపిస్తూ, 'కొడతా' అన్నట్టుగా వూపసాగింది.

కయ్యాలకామాక్షి మరీ రెచ్చిపోయింది. రాళ్లవర్షంలాగా ఒకటే తిట్టడం తిట్టింది కనకాన్ని. కనకం నోరెత్తకుండా చేతుల్లోని చెప్పూ, చీపురుకట్టలతో అదే జవాబుగా చెబుతూ వచ్చింది.

చూడవచ్చిన జనం పొట్టలు చెక్కలయ్యేట్టు తెరపిలేకుండా నవ్వసాగారు. కయ్యాలకామాక్షికి తిట్టీ తిట్టీ నోరు పడిపోయింది. అపసోపాలు పడుతూ "దాహం, దాహం!" అంటూ ఏట్లో దిగి నీళ్ళు తాగసాగింది. జనం మళ్ళీ ఒకటే నవ్వు!

మరికొంతసేపు అయేసరికి కయ్యాలకామాక్షికి గొంతు బొంగురుపోయి మాటే పెగలలేదు. కనకం మొదట్లోలాగే చెప్పూ, చీపురూ చూపిస్తోవుంది.

కయ్యాలకామాక్షి తను ఓడిపోయానని గ్రహించింది. తిట్టుకు తిట్టు జవాబుయివ్వని వాళ్లతో తను గెలపలేనని తేల్చుకుంది. పైగా కట్టమీద చేరిన ప్రజలంతా తనను చూసి విరగబడి నవ్వుతున్నారాయె.




'ఛీ, యీ కూనవరంలో యిక నేను వుండనేవుండను. దరిద్రుగొట్టు వూరు' అనుకొంటూ కయ్యాలకామాక్షి ఏటికట్టనే పడి ఎక్కడికి పోయిందో, పోయింది.

కనకాన్ని ఊరువాళ్ళంతా ఎంతగానో గౌరవించారు. పల్లెత్తుమాట అనకుండా కయ్యాలకామాక్షి అంతటిదాన్ని ఓడించినందుకు ప్రతివాళ్ళూ ఆమె చాకచక్యాన్ని మెచ్చుకున్నారు. బహుమతిగా యిస్తామని ప్రకటించిన ధనాన్ని రెండింతలుచేసి, పెద్ద సభ తీర్చి, కనకానికి బహూకరించారు.

ఆ ధనంతో తమ పేదరికం పోయి సుఖించారు కనకం, భర్త, ఆమెమామ బాలయ్యా.



# ఆప్తులెవరు?

మున్నొకప్పుడు ధర్మదత్తుడనే వైశ్యసత్తముడు ఉండేవాడు. అతనికి రాజదత్తుడు, ధనదత్తుడు అనే ఇద్దరు కుమారులు.

ధర్మదత్తుడు మొదట నిరుపేద. కాని అదృష్టబలంవల్లనూ, చాకచక్యంవల్లనూ, కోట్లు ఆర్జించాడు. ఈనాడు ధర్మదత్తుని ఓడలు విహరించని సముద్రాలు లేవు. అతని అనుచరులు గాలించని దీవులులేవు. అతని చేతుల్లోంచి మారి,లాభం తెచ్చిపెట్టని దినుసులుగాని, వస్తువులుగాని లేవు.

ధర్మదత్తుడు యాభైపైబడాడు. కుమారులిద్దరూ పెద్దవాళ్లయ్యారు. వర్తకపు మెలకువలు తెలిసికొని, తండ్రికి చాలా తోడు పడుతున్నారు. ఇప్పుడు ధర్మదత్తునికి ఎట్టి చీకులూ చింతలూ లేవు. అయినా అతని మనస్సుకి ఏదో వెలితిగానే వుంటున్నది.

ఒకరోజున అతనిలా ఆలోచించాడు— 'నా కుమారులిద్దరూ నా అంతటివాళ్ళు అయ్యారు. ఇక వాళ్లకు నాసాయం అక్కరలేదు. నాకూ ముసలితనం వస్తున్నది. ఇంతవరకూ చెప్పుకోదగిన ఒక్క ఉపకారమేనా నేను ఎవరికీ చేసివుండలేదు. వ్యాపారంలో నావల్ల చెరుపు పొందినవారు చాలామంది ఉంటారు. వారిలో ఒకరికైనా సాయంచేస్తే, పరమార్థం సాధించినట్టు అవుతుంది. కొంత మనశ్శాంతి కలుగుతుంది.'

ఈ ఆలోచన కలిగినవెంటనే ధర్మదత్తుడు పుత్రులిద్దరినీ పిలిపించి వ్యాపారం అంతా వాళ్ళకు ఒప్పగించాడు. కిటుకులన్నీ చెప్పాడు. తరువాత 'నాయనలారా! నేను రేపు వేకువనే లేచి దేశాంతరం బయలుదేరుతున్నాను. కొన్నాళ్ళవరకూ తిరిగి రాను' అని చెప్పాడు.

ఈవార్త విని కొడుకులు కొంత విచారం వెలిబుచ్చారు. కాని పెత్తనం చేజిక్కినందుకు మనస్సులో సంతోషంగానే వుంది.

ఏ. నీలవేణి - ఖర్గపురం





మరునాడు ధర్మదత్తుడు పెందలకడనే లేచి దేశాంతరం వెళ్లటానికి సిద్ధమయ్యాడు. కొడుకులిద్దరినీ పిలిచి 'అబ్బాయిలూ! వెళ్లి వస్తాను. భద్రం!' అనిచెప్పి ముందంజ వేశాడు. అతని చేతిలో ఒక చిన్న సంచి మాత్రం వుంది.

కొడుకులిద్దరూ సంచి చూశారుగాని దానిలో యేముందో గమనించలేదు. ఆ సంచిలో ఏముందో, తెలిస్తే వాళ్లు చాలా ఆశ్చర్యపొయ్యేవాళ్ళు.

ధర్మదత్తుడు దేశాంతరం వెళ్ళుతున్నా నన్నాడేగాని, నగరం విడిచి ఎక్కడికీ వెళ్ల లేదు. ప్రొద్దుపోయిందాకా వూరకనే అటూ ఇటూ తిరిగి కాలక్షేపం చేశాడు. చీకటి పడ గానే నగరంలో ఒక కొసని నిరుపేదలు నివసించే పేటలోకి వెళ్ళి, ఒక నిర్జన ప్రదే శంలో వేషం మార్చేశాడు. చింకి బట్టలు కట్టాడు. ఇప్పుడతన్ని ఎవరూ గుర్తు పట్టలేనంతగా మారిపోయాడు.

బాగా ప్రొద్దుపోయింది. చలికాలం కావటంవల్ల యెవరింట్లో వారు తలుపులు బిడాయించుకొని పడుకున్నారు. అక్క డక్కడ కుక్కలు మాత్రం మొరుగు తున్నాయి.

ధర్మదత్తుడు పోయిపోయి ఒక గుడిసె దగ్గర ఆగి—'అమ్మా! చాలాదూరంనుంచి వచ్చాను, ముసలివాణ్ణి. అలిసిపోయాను. ఈ రాత్రికి ఆశ్రయమిస్తారా నాకు?' అని అడిగాడు. 'ఎవరు నాయనా! లోపలికి రండి' అంటూ నెమ్మదిగా ఒక స్త్రీకంఠం వినిపించింది. ధర్మదత్తుడు తడిక నెట్టుకొని లోపల ప్రవేశించాడు.

ఆ గుడిసెలో వుంటున్నదెవరో ధర్మదత్తు డికి బాగా తెలుసు. ఒక వితంతువూ, ఆవిడ పిల్లలు ముగ్గురూ ఉంటున్నారు. చాలా రోజులక్రితం చనిపోయిన సోమ గుప్తుడి కుటుంబం అది. ఈ సోమగుప్తుడు




ఒకప్పుడు వాణిజ్యంలో ధర్మదత్తుడితో పోటీచేశాడు. కాని నెగ్గలేకపోయాడు. అతని సంసారం చితికిపోయింది. చివరకు అతడు దివాళాతీసి ఆ బెంగతో క్రుంగి, కృశించి చనిపోయాడు. అతని భార్య ఇప్పుడు నగరంచివర నిరుపేదలు నివసించే పేటలో ఒకగుడిసెలో ఉంటూ, కష్టంగా కాలం వెళ్లబుచ్చుతోంది.

గుడిసెలో అడుగుపెట్టగానే ధర్మదత్తుని గుండెనెవరో కలచినట్టయింది. 'ఈ కుటుంబం దుస్థితికి నేనేగదా కారకుణ్ణి' అనుకున్నాడు. వాళ్ళెవరూ అతనిని గుర్తుపట్ట లేదు. ప్రీతిగా ఆహ్వానించి సత్కరించారు.

ఆకుటుంబాన్ని చూడగానే ధర్మదత్తునికి ఎంతో ముచ్చటవేసింది. వారి ముఖాన దారిద్ర్యపు గురుతు లున్నాయి. కానైతే ఎట్టి విసుగూ, బాధా లేదు. తన ఇంట్లో అష్టైశ్వర్యా లుండేవి. కాని ఒకరిని చూస్తే ఒకరికి పడేదికాదు. నౌకర్లుసైతం కాట్లాడుకునేవాళ్ళు.

ధర్మదత్తుడు ఆ రాత్రికి వారింట్లోనే భోజనంచేసి అక్కడే పండుకొన్నాడు. పంచభక్ష్యపరమాన్నాలు లేకపోయినా ఉన్నదాంట్లో లేదనకుండా ప్రీతితో పెట్టారు. అతనికి అది అమృతతుల్యమనిపించింది. ప్రొద్దున్నేలేచి 'తల్లీ! వెళ్ళివస్తాను, ఊళ్ళో పనిఉంది' అన్నాడు. కాని ఇంటావిడ 'బయటకు వెళ్ళినా పూటకూళ్ళేగదా, ఇక్కడే ఉండ'మంటూ బలవంతం చేసింది. లోలోన సంతోషిస్తూ ధర్మదత్తుడు 'సరే' అన్నాడు.

ఇలా పదిరోజులు గడిచాయి. ధర్మదత్తుడు ఆ ఇంట్లోనే తృప్తిమీర ఆతిథ్యం పొందాడు. ఒకరోజున అతడు ఇలా అన్నాడు—'నే నెవరినో ఎరక్కపోయినా, వెంటనే ఆశ్రయమిచ్చారు. నిజంగా మీరు చాలా మంచివారమ్మా!'



'అయ్యో నాయనా! ఎవరైతేనేం? ఒక పూట పెట్టినంతమాత్రాన మా భోగభాగ్యాలు తరిగిపోతాయా?' అన్నది ఇంటావిడ.

'ఎక్కడి ఒక్కపూటమ్మా! నేను పది రోజులనుంచి తిష్ఠవేశానే!' అన్నాడు అతడు.

'అయితేనేం నాయనా! నీకోసం మేము ప్రత్యేకంగా శ్రమపడేదేముంది? ఉన్న దానిలో ఇంత తింటున్నావు. పడివుంటున్నావు. నీవైనా పెద్దవాడివి. ఈ పరాయి దేశంలో ఎక్కడ, ఏంతిప్పలు పడతావు?' అన్నది ఆవిడ. ఇక ధర్మదత్తుడు నిజం చెప్పకుండా ఉండలేకపోయాడు. అతడన్నాడు—'అమ్మా! నేను నిజంగా పరదేశిని కాను. ఈ వూరివాడినే, నాపేరు ధర్మదత్తుడు. గుర్తుపట్టారా నన్ను ఇప్పుడైనా?'

'ధర్మదత్తుణ్ణిగురించి వినటమే గాని ఎన్నడూ చూడలేదు నాయనా! అయినా ధర్మదత్తుడు కోటీశ్వరుడటగదా? ఈ చింకి బట్టలతో నువు 'ధర్మదత్తుణ్ణి'అంటే ఎవరు నమ్ముతారు?' అంది ఆవిడ. అప్పుడు ధర్మదత్తుడు, సోమగుప్తునికీ తనకూ వ్యాపారంలో పోటీజరగటం, సోమగుప్తుడు దివాళా తీయటం—ఆ కథఅంతా చెప్పాడు. కొన్ని కారణాలవల్ల తన స్థితిగతులు దిగజారిపోయాయని, అందువల్ల తాను ఆశ్రయం వెదుక్కుంటూ వచ్చాననికూడా చెప్పాడు.

ఆవిడ పల్లెత్తుమాట అనలేదు. ఒక నిట్టూర్పువిడిచి 'నాయనా, జరిగిందానికేం! పెద్దవయసులో ఎక్కడికెళ్ళిమాత్రం ఏం చేస్తావు? మా ఇంటిలోనే వుండిపో. నీకే లోటూ రాకుండాచూస్తాం' అన్నది ఎంతో ఆప్యాయంగా. ధర్మదత్తుడు 'సరే' నంటూ ఒక్కసారి మాత్రం నగరంలోకి వెళ్ళివస్తానన్నాడు.

ఆ సాయంత్రమే ధర్మదత్తుడు వెంట తెచ్చుకొన్న సంచి పట్టుకుని తిరిగి ఇంటికి వెళ్ళాడు. తండ్రిని చూచి రాజదత్త, ధన

దత్తు లిద్దరూ 'ఏం నాన్నా! వచ్చావా? నీసంగతే రోజూ అనుకుంటున్నాం' అన్నారు. అందుకు ధర్మదత్తుడు—' అత్యవసరమైన ఒకపని తగిలింది. అందుకని వచ్చాను. వెంటనే ఒక పాతికవేల మాడలు కావాలి' అన్నాడు.

'అయ్యో! ఇప్పుడెలా? ఇంటిలో రొక్కంలేదే!'అని పెదవి విరిచాడు పెద్దవాడు.

'ఇంత మొత్తం ఇప్పుడు ఎందుకు?' అన్నాడు చిన్నకొడుకు. 'ఈ మొత్తం నేను ఒకరికిచ్చి సాయపడదలచుకొన్నాను' అంటూ సోమగుప్తుని కుటుంబంసంగతి అంతా చెప్పాడు, ధర్మదత్తుడు.

ఇది విని అతని కుమారులు మండి పడ్డారు. 'చెమటోడ్చి సంపాదించిన ధన మంతా ఈవిధంగా కానివాళ్లకు పంచిపెట్టి గంగపాలు చేస్తావా? లోకంలో ఎక్కడన్నా వుందా ఇట్లాంటిది?' అని లేచారు. వాళ్ల కేకలు విని నలుగురూ పోగయ్యారు.

అప్పుడు ధర్మదత్తు డన్నాడు—'అబ్బాయిలూ! ఆగ్రహపడకండి. మీకు నేను కోట్లు సంపాదించి ఇచ్చాను. పెంచి పెద్ద వాళ్లను చేశాను. కాని మీరు నానిమిత్తం ముష్టిపాతికవేల మాడలు ఇవ్వలేక పొయ్యారు. మీసంగతి నాకు ముందుగానే తెలుసు. అందుకని, తగు జాగ్రతలోనే వున్నాను. ఇదిగో చూడండి!' అని సంచివిప్పి చూపించాడు. దానిలో లక్షలు ఖరీదుచేసే మణులూ, రత్నాలూ ఉన్నాయి. కొడుకు లిద్దరూ తెల్లబోయారు. అందరూ ఆశ్చర్య పడ్డారు. ధర్మదత్తుడుమాత్రం విచారంగా బయటకు నడిచాడు.

ఆ సాయంవేళ వేసటగా తిరిగి వచ్చిన ధర్మదత్తుణ్ణి,చనిపోయిన సోమగుప్తునిభార్యా పిల్లలూ ప్రీతితో ఆహ్వానించారు. ధర్మ దత్తుడు ఎక్కడకు వెళ్లివచ్చిందీ, ఆ సంచి విషయమై ఎంత రగడ జరిగిందీమాత్రం వాళ్లకు తెలియనే తెలియలేదు.






పూర్వం సుయోధసింహుడనే రాజుండేవాడు. అతని తాతగారి కాలంలో వారి రాజ్యం చాలా పెద్దది. అయితే సుయోధుడి తండ్రి భోగలాలసుడూ, తాగుబోతూ. అవివేకీ కావటంవల్ల చుట్టుపక్కల రాజ్యాలను ఏలే రాజులు దురాక్రమణచేసి చాలాభాగం అపహరించారు. సుయోధుడు సమర్థుడు, దీక్షాపరుడు, ధీరుడు. అతను రాజ్యానికి వస్తూనే తనతండ్రిచేసిన అక్రమాలను సర్దుబాటు చేశాడు. తండ్రి చేరదీసిన దుష్టులకు ఉద్వాసనచెప్పాడు. వివేకులైనవారిని ఏరి వారికి వివిధ రాజ్యాంగశాఖలు వప్పగించి ప్రజలలో కొత్త ఆశ రగిల్చాడు.

ఈపని పూర్తికాగానే సుయోధుడు తన తండ్రి పోగొట్టుకున్న రాజ్యం యావత్తూ తిరిగి జయించటానికి ఉపక్రమించాడు. అతని యుద్ధసన్నాహంలో ప్రజలంతా పాల్గొన్నారు. రాత్రింబగళ్ళు కత్తులూ, ఈటెలూ, బరిసెలూ, బల్లెములూ, బాణాలూ ఉత్పత్తి చేశారు. అనేకలక్షలమంది ప్రజలు సైనిక విద్య నేర్చుకున్నారు. బలమైన సైన్యమూ, సైన్యానికితగిన ఆయుధాలూ తయారయాయి. రాజ్యమంతటా యువకులు వేదోక్తంగా దీక్షాకంకణాలు ధరించారు. సుయోధుడు తన తాతలనాటి రాజ్యాన్ని తిరిగి సాధించుకునేటందుకు జైత్రయాత్ర ఆరంభించాడు.

ఈ యాత్ర ఒకటిరెండేళ్ళపాటు నిర్విఘ్నంగా కొనసాగింది. కొన్నిరాజ్యాలు సుయోధుడి సైన్యాలను చూసి రాజీరాయబారాలు జరిపాయి. కొన్నిచోట్ల సైనికులు తమ రక్తబంధువులైన సుయోధుడి సైనికులతో యుద్ధంచేయ నిరాకరించారు. యుద్ధం జరిగినచోట్ల కొద్దిసేపట్లోనే సుయోధుడి బలాలు శత్రుమూకలను చెల్లాచెదరు చేశాయి. విజయపరంపర లభిస్తున్నకొద్దీ

కొడవటిగంటి కుటుంబరావు



సైన్యాన్నికూడా లోపలికి రాకుండా నిల వేయగలరు. అభేద్యరాజులు సాధారణంగా యుద్ధాలలోకి దిగేవారుకారు. ఇతరులు తమపై దురాక్రమణచేస్తే బుద్ధిచెప్పి పంపే వారు. అటువంటి వంశానికి చెందినవాడైన అభేద్యరాజు, సుయోధుడి తండ్రి అసమ ర్థతను గమనించి అతని రాజ్యంలో కొంత అపహరించాడు. దానిని తిరిగి రాబట్టుకోవ టానికే సుయోధుడు అభేద్యపై దండెత్తాడు.

అభేద్యకోట నిజంగా దుర్భేద్యమేననీ, కోటను ముట్టడించటం తప్ప మరేమీమార్గం లేదనీ, కేవలం బలప్రయోగంచేసి కోట ద్వారాలు పగలగొట్టి లోపల ప్రవేశించినా సర్వబలనాశనం తప్ప మరొకటి ఉండదనీ సుయోధుడి సేనానాయకుడు చెప్పాడు. సుయోధుడు కోటను ముట్టడించి, అభేద్య రాజు రాజీకి వచ్చేవరకూ ముట్టడి సాగు తుందని తెలియజెప్పటానికి కోటలోనికి దూతను పంపాడు.

సుయోధుడి దూతకు ఏ ద్వారంవద్దా అవాంతరం కలగలేదు. పైపెచ్చు అతనికి సన్మానాలు జరిగాయి. రెండు మూడు ఘడియలకాలంలో అతను రాజసౌధం ప్రవేశించాడు. రాజభటులు అతనిని ఒక స్త్రీ ఎదుటికి తీసుకుపోయినారు. ఆ స్త్రీ రాజ

సుయోధుడి పరాక్రమమూ, అతని సైని కుల ఉత్సాహమూ పెరగసాగింది.

ఈవిధంగా ఒక్కొక్క ప్రాంతమే గెల్చు కుంటూ, ఓడిన రాజులతో ఉదారంగా సంధి చేసుకుంటూ, పాత శత్రువులతోనూ, వారి వారసులతోనూ మైత్రి సంపాదించుకుంటూ సుయోధుడు 'అభేద్య' అనే రాజ్యపు పొలి మేరలు చేరుకున్నాడు.

అభేద్యరాజులకు చాలాబలమైన కోట ఉన్నది. ఊరుచుట్టూ మూడు బలమైన, ఎత్తయిన ప్రహరీలున్నాయి. ఒకలక్ష సైని కులు ఈ గోడలపై దాగి ఎంతటి బలమైన

లాంఛనాలను ధరించి పూర్ణచంద్రుడులాగా వెలిగిపోతున్నది. ఆమె వయసుకూడా పందొమ్మిది, ఇరవైకంటె ఉండదు. ఆమె సుయోధుడి దూతను సుఖాసీనుణ్ణిగా చేసి వచ్చిన పని చెప్పమన్నది.

"అమ్మా, క్షమించాలి. నేను మోసుకు వచ్చిన సందేశం తమ ఏలికకు తప్ప నివేదించలేను," అన్నాడు దూత.

"నేనే ఏలికను. మా తండ్రిగారు అస్వస్థులుగా ఉన్నారు. కొంతకాలంగా నేనే రాజ్యభారం వహిస్తున్నాను," అన్నదా సుందరి, తన వేలినున్న రాజముద్రిక చూపుతూ.

"దేవీ, ఏలికఅయిన సుయోధసింహులు తమతో ఇట్లా చెప్పమన్నారు: 'మీ కోటను నేటిఉదయం ముట్టడించిఉన్నాము. మీరు మాతో మా ఇచ్ఛానుసారము సంధి జరిపే వరకూ ముట్టడి సాగితీరుతుంది. ఈ ముట్టడి వల్ల మీకు కలిగే వ్యయప్రయాసలకు మీరే బాధ్యులు'" అన్నాడు దూత.

అభేద్యరాణి కొంచెంసేపు ఆలోచించి, యిలా అన్నది:

"అభేద్యకు ఏలికనైన నేను, రూపమతిని, ఈ విధంగా చెప్పానని మీ ఏలికతో చెప్పవలసింది: 'అంతఃపురము ముట్టడించేదాకా కోట మీకు వశంకాబోదు'."




రాజదూతకు ఈసందేశం అర్థంకాలేదు. కాని అతడు వివరాలడగ లేదు. అభేద్య రాణి అతనికి తమ కోట జీవితం చూసే అవకాశం కల్పించింది. అతను తన గుర్రం మీద కోట వివిధప్రాంతాలకు వెళ్ళి పరిస్థితులు చూశాడు. అంతటా ప్రశాంతంగా ఉంది. మామూలు వేత్రహస్తులు తప్ప అతనికెక్కడా సైనికులుకూడా కనిపించలేదు. ఎవరూ యుద్ధంగురించి మాట్లాడటంలేదు. నిత్యజీవితం నిశ్చింతగా వెళ్ళిపోతున్నట్టు కనపడ్డది. ఇదంతా చూసి రాజదూత తిరిగి




వెళ్ళి తన సైన్యాలను చేరుకొని సుయోధుడిదగ్గిరికి చేరాడు.

రూపమతి పంపిన సందేశం సుయోధుడికి అర్థంకాలేదు. అంతఃపురం ముట్టడిస్తే కోట వశం కావటమేమిటి? అర్థంలేని మాట. ఆవిడకు యుద్ధశాస్త్రం తెలియక ఏదో నోటికి వచ్చినమాట అనిఉంటుంది. అసలే ఆడది. అందులోనూ కొత్తగా రాజ్యానికి వచ్చింది. ఈ అమాయకురాలితో తాను రాయబారం జరపటం వృథా.

అభేద్యలో ప్రజలు నిర్విచారంగా ఉండటమూ, ఎక్కడా సైనికులు కనిపించక పోవటమూకూడా రూపమతి అమాయకత్వం వల్లనే అయిఉంటుంది. అమాయకురాలు కాకపోతే తనదూతను యుద్ధసమయంలో అంతా చూడనిస్తుందా?

సుయోధుడికి ఒకటి తట్టింది. దాడి చేస్తే సులభంగా చేజిక్కే కోటను ముట్టడి వెయ్యటం దేనికి? ఈఅమాయకురాలినుంచి అభేద్యను తాను సంగ్రహించాలనికూడా సుయోధు డాలోచించాడు. ఇటువంటి రాజ్యం ఎట్లాగూ పరరాజుల పాలవుతుంది. ఇప్పుడు తాను బలాఢ్యుడు. అభేద్య తన కిందికే రావటం మంచిది.

కోటలోపల యుద్ధయత్నాలు లేవన్న వార్త సైనికశ్రేణులలో కార్చిచ్చులా వ్యాపించి ఉత్సాహం రేకెత్తించింది. కోట మీదికి దాడిచెయ్యటానికి రెండు దళాలు అయత్తపరచబడ్డాయి. ఒక దళం కోట గోడలు ఎగబాకింది. రెండవ దళం ద్వారాన్ని భేదించటానికి కదిలింది.

ఈ రెండుపనులూ దాదాపు నిర్విఘ్నంగానే కొనసాగాయని చెప్పాలి. కోట తలుపులు మొదటి దెబ్బకే వాటంతట అవి తెరుచుకున్నాయి. సైనికులు కొందరు లోన ప్రవేశించారు. మళ్లీ తలుపులు మూసుకున్నాయి. కారణం తెలియలేదు. కోట



గోడలు ఎగబాకిన సైనికులకుకూడా ఎట్టి ప్రతిఘటనా లేకపోయింది. కాని ఈ రెండు దళాల సైనికులూ మళ్లీ తిరిగిరాలేదు. వారి గతి ఏమయినదీ సుయోధుడికి తెలియు లేదు. రెండురోజులు ఆగి మరింత పెద్దదాడి చేశాడు. దానిగతీ ఇంతే అయింది.

సుయోధుడు రూపమతిదగ్గిరికి మరొక రాయబారం పంపాడు. ఒక్క వారం రోజులలో కోట తనకు వశంకానిపక్షంలో తన సైన్యాలన్నిటినీ ప్రయోగించి కోటమీద దాడిచేసి భీకరమైనయుద్ధంతో సర్వనాశనం చేస్తానని రూపమతిని బెదిరించాడు. రూపమతినుంచి జవాబు వచ్చింది :

"అంతఃపురం ముట్టడిస్తేగాని కోట లొంగదు."

సుయోధుడికి అపరిమితమైన కోపం వచ్చింది. రూపమతి తాను అనుకున్నంత అమాయకురాలుగా కనిపించలేదు. అమె తనను పరిహసిస్తున్నట్టున్నది. అమెకెందు కింత కావరం? బయటినుండి ఏమీరాకుండా కోటలోవాళ్లు ఎట్లా బతుకుతున్నారు? తన సైన్యాలు చుట్టుపక్కల గ్రామాలు కొల్ల గొట్టినాకూడా జీవితం దుర్భరంగా ఉన్నది. ఎండలూ, వానలూ, చలీ సైనికులను అపరి మితంగా బాధిస్తున్నాయి. ఈ ముట్టడి సాగించటానికి తనకే విసుగుగా ఉన్నప్పుడు కోటలోపలివారికింకెంత బాధగా ఉండాలి? ఈ సంగతి రూపమతికి తెలియదా? అమె తనతో సంధి ఎందుకు చేసుకోదు? పైపెచ్చు ఈ అర్థంలేని సందేశమేమిటి?

ఏమైనాసరే రూపమతి కాళ్లబేరానికి వచ్చే దాకా సుయోధుడు ముట్టడి సాగించటానికే నిశ్చయించాడు. అతను కోటవాకిలి కెదు రుగా గుడారంవేసుకుని వాకిలికేసి చూస్తూ కూచునేవాడు, ఏక్షణాన అ వాకిలి తెరుచు కుని రూపమతి తనతో రాయబారానికి వస్తుందో అని!




నిజం దాచటం దేనికి? ఆమె సౌందర్యం గురించి తనదూత చెప్పినప్పటినుండీ ఆమె నొకసారి చూడాలన్న కోరికకూడా సుయోధుడి హృదయంలో ఉంది.

కాని సుయోధుడి ఆశ ఫలించలేదు. నెలలు గడిచాయి. ఆకాశాన చంద్రుడు ఎన్నోసార్లు అదృశ్యుడైనాడు, చిక్కి కని పించాడు, చూస్తుండగానే కొలుకున్నాడు, మళ్ళీ చిక్కాడు. సుయోధుడి మనస్సు కూడా చంద్రుడిలాగే పరివర్తన చెందుతూ వస్తున్నది.

రానురాను సుయోధుడి గతి చాలా హీన స్థితికి వచ్చింది. కోటవెలుపల అయిదారు ఆమడల మేర ఊళ్ళుగాని, వ్యవసాయం గాని లేకుండాపోయింది. అభేద్యను సుయోధుడు ముట్టడిస్తే సుయోధుడి బలాలను దేవుడు ముట్టడించినట్టయింది. సైనికులకు తిండి లేదు. వారు తమ గుర్రాలనుసయితం చంపి తినసాగారు. ముట్టడి విఫలమయిం దని సుయోధుడి అంతరాత్మకు తెలుసును. అతనికి యుద్ధంమీదనే గాక జీవితంమీదనే విరక్తి కలిగింది. సైనికులకా ఎప్పుడు ఇళ్ళకు పోదామా అని ఉంది. వారిలో ఏమీ ఉత్సాహం లేదు. ఇక ముట్టడి ఎత్తి తిరిగి పోవటంకన్న సుయోధుడికి గత్యంతరం లేదు. ఈ నిర్ణయాన్ని అతడు వాయిదా వేస్తూవస్తున్నాడు.

ఆరాత్రి నిండుచంద్రుడు ఆకాశాన వెలుగుతున్నాడు. అర్ధరాత్రి కావస్తున్నది. సుయోధుడికి నిద్రపట్టలేదు. అతను తన గుడారంబయట నిలబడి రూపమతిని గురించి ఆలోచిస్తున్నాడు. ఆమె అమా యకురాలన్న భావమూ, జాణ అన్న భావమూకూడా ఇప్పుడతనికి లేవు. ఆమె మీద ఏదో గౌరవభావం మొలకెత్తింది. ఒక్కసారి ఆమెను చూడాలన్నకోరిక తీవ్రంగా కలిగింది. తాను ఏమిచెయ్యా

బోతున్నదీ తెలియకుండానే కోటవాకిలి దగ్గిరికి వెళ్ళి తలుపు తట్టాడు. తలుపు తెరుచుకున్నది.

"ఎవరు మీరు?" అని అడిగాడు తలుపు తెరిచిన భటుడు.

"సుయోధుడి దూతను," అన్నాడు రాజు.

"స్వాగతం. దయచేయండి."

మరొక ఘడియలోపల సుయోధుణ్ణి రూపమతి భటులు అంతఃపురం చేర్చి అతనికి శయనాదికాలు ఏర్పాటు చేశారు. కాని అతను నిద్రపోలేదు. ఎప్పుడు తెల్లవారుతుందా అని ఎదురుచూస్తూ కూర్చుని తూర్పు తెల్లవారగానే బయటికి వచ్చాడు. అతని నెవరూ అడ్డలేదు, వెంబడించలేదు. సుయోధుడు దాదాపు కోట ఆవరణ అంతా తిరిగాడు. ఎక్కడ చూసినా శుష్కించి శల్యాలైపోయిన మనుష్యులు కనిపించారు. దారిద్ర్యం ఓలలాడుతున్నది. ఒక వృద్ధుడు సుయోధుణ్ణి చూసి, "పరదేశస్థులు లాగా వున్నారు. నా ఆతిథ్యం స్వీకరించండి. ఒకప్పుడు పంచభక్ష్యపరమాన్నాలతో ఆతిథ్యం ఇచ్చిన మేము ఈనాడు గంజితప్ప ఇవ్వలేని స్థితిలో ఉన్నాం" అన్నాడు.



సుయోధుడి కన్నులు చెమ్మగిలినయి. అతను నేరుగా అంతఃపురానికితిరిగివెళ్ళాడు. రూపమతి తనకు దర్శనం ఇవ్వటానికి సిద్ధంగాఉన్నట్టు తెలిసింది. భటుల ననుసరించి సుయోధుడు రూపమతి సమక్షానికి వెళ్ళాడు.

ఆమె అతనిని గుర్తించింది. ఎంతో గౌరవంగా మర్యాదలు చేసి, "దౌత్యానికి మీరే వచ్చారు, దూతలు లేకపోయారా?" అన్నది.

సుయోధుడు క్షణంసేపు మాట్లాడలేదు. ఆమె సౌందర్యంగురించి తన దూత చెప్పిన మాటల్లో అతిశయోక్తి ఏమీ లేదు. కాని

మామూలు ప్రజలలాగే ఆమె కూడా శుష్కించి ఉన్నది.

"నీ పట్టుదల నాకర్థం కాలేదు. నీ ప్రజలు తిండిలేక అల్లాడిపోతున్నారు. ఈ ముట్టడి ఇంతకాలం పొడిగించటం దేనికి? సంధికెందుకు రాకూడదు?" అన్నాడు సుయోధుడు.

"మీరు అభేద్యను ఎందుకు ముట్టడించ వలసివచ్చిందో మాకు తెలియదు. మా తండ్రిగారు మీ తండ్రిగారినుండి రక్షించిన రాజ్యభాగాన్ని మీరే పాడుబెట్టుకున్నారు. అభేద్య మీకు లొంగదు. మేమంతా ఆకలితో మాడినా అభేద్య అభేద్యంగానే ఉంటుంది. మీరు ముట్టడి ఎత్తివెళ్ళి పోవటానికి మా అభ్యంతరం లేదు. కోటను జయించాలెనన్నది మీ సంకల్పమయితే అంతఃపురాన్ని ముట్టడించండి," అన్నది రూపమతి.

సుయోధుడికి ఆమె సందేశం ఇప్పటికి అర్థమయింది.

అతడు తన ఆసనంనుంచి లేచి ఆమె వద్దకు పోయి మోకరించి, "రూపా, నేను చేసిన అపచారాన్ని క్షమించు. నన్ను అనుగ్రహించి వివాహమాడు. నాకు నీకన్న ఆప్తులు లేరు. మనం శత్రువులుగా ఉండలేము," అన్నాడు.

రూపమతి అతనిని లేవనెత్తి తన సింహాసనంపై కూర్చోబెట్టుకుని మంత్రులకు కబురుపంపింది. అంతఃపురం సుయోధుడి వశమయింది.

మరికొద్దిసేపటిలో కోటద్వారాలు తెరుచుకున్నాయి. సుయోధుడి సైన్యాలకు కోట కూడా వశమయింది. అభేద్యకు తిరిగి శోభ చేకూరింది. మంచిముహూర్తాన సుయోధుడికీ రూపమతికీ వైభవంగా వివాహం జరిగింది.



# ప్రపంచంలోకల్లా పెద్దపువ్వు

మనం ఎన్నెన్నో రకాల పువ్వులు చూచివుంటాం. రంగురంగుల పువ్వులు మనకు ఆనందాన్ని కలిగించినవి ఉంటాయి. రకరకాల పువ్వులు వాటి వాటి పరిమళాలతో మనకు తన్మయత్వం కలిగించినవికూడా వుంటాయి. కాని, ఇప్పుడు మనం తెలుసుకోబోయే పువ్వు మోస్తరు ఆశ్చర్యం కొలిపే పువ్వు మాత్రం చూచివుండము. ప్రపంచంలోకల్లా పెద్దపువ్వు అని చెబితే, అది ఎంతటి అపూర్వమయిందీ ఇట్టె వూహించుకోవచ్చు.

ఈపువ్వు వెడల్పు ఒకగజం. మధ్యభాగం ఒక పెద్దదొన్నె ఆకారంలో వుంటుంది. దీనిలో ఒకటిన్నర గాలనుల నీరు పడుతుంది. పసుపు రంగుగావుండి అక్కడక్కడ తెల్లనివిగానీ, ఊదావిగాని చుక్కలు వుంటై. దీని మొగ్గలే ఎంతలేదన్నా కేబేజి అంతలేసి వుంటై. దీనికి ఐదు రేకలు కలిగి, ఒక్కొక్కరేక అరచేతి మందాన వుంటుంది. అన్నిటికన్న చిత్రమేమిటంటే దీనికి ఆకులు లేవు!



మరొక విశేషం—ఇది మొలవటం భూమిలో కాదు. అడవిలో వుండే పెద్దచెట్ల పొడుగాటి వేరులోంచి యిది పుట్టుకొస్తుంది. అంటే, దీని వేరు ఆ చెట్టువేరులోకి పాకిపోతుందన్నమాట. ఈ పువ్వును కొయ్యటం అంత తేలికపని కాదు. ఎందుచేతనంటే దీని బరువు పదిహేను పౌన్లు వుంటుంది.

ఈ పువ్వు సుమాత్రాదీవిలోని ఉష్ణప్రదేశపు అడవులలో కనుపిస్తుంది.

ఇన్ని చిత్రాలతో కూడుకొనివున్న ఈ పువ్వును 1818 సంవత్సరంలో సర్ స్టాంఫర్డ్ రాఫెల్స్ అనే అతడు కనిపెట్టటంవల్ల, దీనికి 'రాఫెల్షియా' అని ఆ వృక్షశాస్త్రిజ్ఞుని పేరే వచ్చింది.




అనగనగా ఒక పల్లెలో ఒకానొక చాకలి ఉండేవాడు. ఆ చాకలికి ఒక గాడిద వుండేది. ఒకనాడు, వాడు ఉతికి ఆరబెట్టిన బట్ట లన్నీ రెండు మూటలుగా కట్టి, అటొకటీ ఇటొకటీ గాడిదపైన వేసుకొని, కూనిరాగాలు తీసుకొంటూ, చీకటిపడ్డాక పల్లెకు తిరిగి వస్తున్నాడు. కొండపక్కనే ఏదోశబ్దం వినిపించి ఆగేడు.

ఆ శబ్దం వచ్చిన దిక్కుకి వెళ్లాడు చాకలి. చూడగా అతడు, గుండెనొప్పితో అమిత బాధపడుతున్న ఒక పరదేశి. తన వెంట రమ్మని ఎంతగానో పిలిచాడు చాకలి. 'కదలలేను. గాడిదమీద ఎక్కించుకుపో' అన్నాడు వాడు.

అప్పటికే గాడిద నడ్డిమీద బరువు ఎక్కువగా ఉండటంవల్ల, చాకలికి మనస్కరించింది కాదు. కానీ, ఆ దిక్కుమాలిన వాణ్ణి ఆ రాత్రివేళ వదిలేసి వెళ్లటానికీ మనసొప్పింది కాదు. అందుచేత, మూటలు తీసి మూపున బెట్టుకొని, ఆ పరదేశిని గాడిదమీద ఎక్కించుకుని ఎలాగో వాడు తన గుడిసెకు చేరుకున్నాడు.

చాకలిపెళ్లాం మంచిదే గాని కొంచెం గయ్యాళి. పరదేశిని వాడు మెల్లిగా దింపి యింట్లోకి తీసుకొస్తోండగా చూచి 'వీడినొకణ్ణి తెచ్చావూ నా నెత్తిమీదకు!' అని కోపగించింది. సంగతి సందర్భాలు మెల్లిగా చెప్పాడు, చాకలి.

పరదేశి గుండెబాధ క్రమంగా ఎక్కువైంది. అర్ధరాత్రి అయేసరికి అతడు చాకలిని లేపి, 'తమ్ముడూ, ఇంక నే బ్రతకను. నామూటలో గంధపుచెక్కతో చేసిన చిన్న పెట్టె ఒకటి ఉంది. అది నువ్వు తీసుకో. అందులో......' అని ఇంకా ఏదో చెప్పబోతూవుండగానే ప్రాణాలు పోయినై.

చాకలిది లేచింది. 'అనుకున్నంతా అయింది! వీడు వచ్చివచ్చి మనయింట చచ్చాడే! వీణ్ణి తీసుకొచ్చి, డబ్బుకోసం

పాలంకి వెంకటరామచంద్రమూర్తి - మద్రాసు

చంపేశామని అనుకోదూ లోకం ?' అంటూ అనేక విధాల విచారించింది.

చాకలికేమీ పాలుపోలేదు. 'అలైతే ఇతగాడి సంగతి ఎవరికీ తెలవకుండానే, ఈ శవాన్ని తీసుకుపోయి పాతిపెట్టి చక్కా వస్తాను' అని, ఆ పీనుగను గాడిదమీద ఎక్కించుకుని శ్మశానానికి వెళ్ళేడు.

వెళ్ళేడన్నమాటేగాని, వాడిని యెవరో వెంబడిస్తూన్న సంగతి గమనించనేలేదు. వాడు చాకలి ఎదురింటిలో ఉంటూవుండే మంగలే. శవాన్ని పాతిపెట్టేసి ఇంటికి తిరిగి వచ్చి నిశ్చింతగా నిద్రపోయాడు చాకలి. కాని చాకలిని వెంబడించిన మంగలివాడికి మాత్రం కంటిమీద కునుకు లేకపోయింది. ఇరుగుపొరుగిళ్ళల్లో యేం జరిగేదీ కని పెడుతూవుండటమే వాడిపని.

ఇప్పుడు వాడు, పరదేశిని గాడిదమీద చాకలి ఎలా యెక్కించుకువచ్చిందీ, ఆ తరవాత యేమిజరిగిందీ అంతా, పెద్దకాపు వద్దకు పోయి ఏకరుపెట్టాడు.

పెద్దకాపు వెంటనే చాకలిని రప్పించి, 'ఏమిరా అబ్బాయీ!—నువు దోచుకున్న ధనమంతా సరిగా మాకు వప్పగిస్తావా, లేదా ?' అని బెదిరించాడు.




అందుకు చాకలి, 'బాబూ! ఒట్టుపెట్టుకు చెప్పుతున్నాను. ఆ పరదేశివద్ద చిల్లి కానీకూడా లేదు. చిన్న పెట్టెమాత్రం ఒక టున్నది వాడి మూటలో' అన్నాడు.

పెద్దకాపు ఆ పెట్టె తెప్పించి చూచేసరికి, దానిలో పాత తాటాకుముక్క ఒకటీ, దీపంలాటిది ఒకటీ తప్ప మరేమీ కనిపించ లేదు. ఆ తాటాకుముక్కమీద ఏదో రాసి వున్నది, కాపుకి తెలియని భాషలో. కాపు విసుక్కొని, మంగలిని రెండూ, చాకలిని రెండూ తిట్టి పొమ్మన్నాడు.

పోతూవున్న చాకలిని ఆపి, పెద్దకాపు 'ఈసారికి నిన్ను వదిలేశాను. ఈ పెట్టె



నువ్వే పట్టుక పో. కాని, నాక్రీశమ అంతా కలగజేసినందుకుగాను నీ గాడిదను తెచ్చి మా పెరట్లో కట్టివెయ్యి. నీకిదే శిక్ష' అని చెప్పి పంపివేశాడు.

'ఉపకారానికి పోయి నాగాడిదనే పోగొట్టుకున్నానే!' అని చాకలి విచారించాడు. ఆ విచారంలో, పాయిలోకి ఏమీలేదని సణుగుకొంటూన్న పెళ్లానికి ఆ గంధపుచెక్క పెట్టె యిచ్చి, 'ఇది తీసుకుని నిప్పు రాజెయ్యి!' అన్నాడు, విసుక్కొంటూ.

ఆ పెట్టెలో తాటాకుముక్కమీద అక్షరాలు చూచింది, చాకలిది. ఆమెకు వింతగా తోచింది. 'ఇదేమిటో ఎవరిచేతనైనా శాస్త్ర చదివించుకు రారాదూ?' అన్నది భర్తతో.

వాడు వెంటనే ఊళ్లో శాస్త్రుల్లుగారి దగ్గిరకి ఆ ముక్క తీసుకుపోయి చూపాడు. ఆయన అదంతా చదివి, 'ఇదేదో మంత్రంరా అబ్బీ! ధనం పాతిపెట్టిన చోటుకు వెళ్లి ఈ మంత్రం చదివితే ఆ ధనం వశమవుతుందట!' అని చెప్పి, ఆవెంటనే 'ఏంలాభంలే!' అంటూ పెదవి విరిచాడు.

'బాబూ అలా ఊరుకున్నారేం!' అన్నాడు చాకలి.

'ఏంలేదురా. ఈ మంత్రం చదివేటప్పుడు పంచలోహాలతో చేసిన మంత్రదీపం వెలిగించాలట. అటువంటి మహిమగల దీపం మనకెక్కడ దొరుకుతుంది? వట్టి మాట!' అన్నాడు, శాస్త్రుల్లు.

శాస్త్రుల్లు చెప్పిన ఈ మాట వినగానే, చాకలివాడు యింటికి పరుగెత్తిపోయి, తనవద్ద గంధపు పెట్టెలో వున్న ఒక దీపపు బుడ్డి తెచ్చి ఆయనకు చూపించాడు. అప్పుడా బ్రాహ్మణుడు చూచి, అదే మంత్ర దీపమని తెలుసుకుని, 'అరి పిడుగా!— ఇదెక్కడ సంపాదించావురా?' అనేసరికి, వాడు కథంతా చెప్పుకొనివచ్చాడు.




బ్రాహ్మడు, మళ్ళీ ఒకసారి తాటాకు బాగా పరిశీలించి, 'అయితే, ఆ పరదేశి నీ కెక్కడ కనపడ్డాడురా?' అని ఆత్రంతో ప్రశ్నించాడు.

చెప్పాడు, చాకలి.

ఆరోజునే అర్ధరాత్రివేళ, పిట్టకైనా తెలియకుండా, బ్రాహ్మడిని వెంటబెటుకుని వాడు అడవిలో కొండవద్దకు చేరుకున్నాడు. ఆ పరదేశి తనకు కనపడ్డచోటున ఆగి, తన చేతిలో వున్న మంత్రదీపం వెలిగించాడు. ఆ దీపంవెలుగున శాస్త్రుల్లు తాటాకుముక్క మీది మంత్రం చదువసాగాడు.

ఆశ్చర్యం!—వెంటనే కుతకుతశబ్దం ప్రారంభమై, కొంతసేపయేసరికి ఎదురుగా వున్న కొండలోపల ద్వారం ఒకటి తెరుచుకుంది. శాస్త్రుల్లూ, చాకలీ ఆశ్చర్యపడి, నిబ్బరంగా ద్వారంలోపల ప్రవేశించారు.

కిందని మెట్లు కనబడినై. ఆ మెట్లమ్మటే దిగి వెళ్ళేసరికి రెండు పెద్ద రాగిబిందెలూ, వాటిపక్కనే విచ్చుకత్తులతో ఒక యక్షుడూ కనబడ్డారు. బ్రాహ్మడు భయపడాడుకాని, 'అబ్బాయి!—దీపంమాత్రం ఆరిపోనివ్వకు సుమా!' అంటూ చాకలిని హెచ్చరించాడు.

యక్షుడు ఏమీ అనకుండా, బొమ్మలాగా అలానే నిలబడివున్నాడు. శాస్త్రుల్లు అటుయిటు చూచి, మెల్లిగా బిందెలమూతలు తీశాడు. వాటినిండా రత్నాలే! అన్నీ బంగారుమొహిరీలే! అవన్నీ ముత్యాల హారాలే! కన్నులు జిగాల్‌మనిపించినై!!

అంగవస్త్రంలో పట్టినన్నీ శాస్త్రుల్లు మూట కట్టాడు. ఒడిపట్టినన్నీ చాకలివాడు కట్టాడు.

తరువాత, ఇద్దరూ యివతలకు వచ్చేసి, దీపం ఆరిపేశారు. దీపం ఆరిపోవటంతో కొండద్వారం మూసుకపోయింది.

దారిలో బ్రాహ్మడు 'అబ్బీ!— ఈ రహస్యం నీ భార్యకైనాసరే, తెలపనివ్వకు సుమా!' అని చెప్పి, ఇంటికి వెళ్ళిపోయాడు.



చాకలివాడు తన గుడిసెలో ప్రవేశించేసరికి పెళ్లాం లేచి 'అర్ధరాత్రివేళ వూరంతా తిరిగివచ్చావుటయ్యా!' అని పారాయణ మొదలెట్టింది.

అప్పుడు వాడు 'గొడవ చెయ్యకు. ఊరికే వెళ్ళాననుకున్నావా? చూసుకో!' అంటూ, ఒక ముత్యాలహారం తీసి పెళ్లాం ఒడిలోకి విసిరాడు. ఆమె బ్రహ్మానందం పొంది, ఇది యెక్కడిదో చెప్పమంటూ వేపుకొనితిన్నది.

అందుకు చాకలి, 'ఎక్కడా అనబోకు సుమా!' అంటూ, గుట్టు అంతా వెల్లడి చేశాడు. ఆమె ఎవరితోటీ అనలేదుకాని, మంగలి పెళ్లాంతో మాత్రం 'చూశావుటే ఈ హారం!' అంటూ, చూపించింది.

ఇంకేముంది? మరుక్షణంలోనే మంగలి వెళ్ళి పెద్దకాపు చెవిలో ఊదేశాడు. పెద్ద కాపు పనివాళ్ళను వెంటబెట్టుకువచ్చి చాకలి యిల్లు సోదాచేసేసరికి, బంగారు నాణేలూ, ముత్యాలహారాలూ దొరికిపోయినై.

'నువ్వు నిజంగా ఆ పరదేశిని చంపే వుండాలి. లేకపోతే యివన్నీ యెక్కడివి నీకు!' అని గద్దించాడు, పెద్దకాపు.

అందుకు చాకలి, 'ప్రభువులు కరుణించాలి. నేనెవరినీ చంపలేదు. జరిగిన సంగతిది. కావాలంటే శాస్త్రుల్లుగారినే అడగండి' అన్నాడు, వణుకుతూ. దాంతో బ్రాహ్మణ్ణికూడా లాక్కువచ్చారు.

బ్రాహ్మడు గడుసువాడు గనుక మెల్లిగా 'అయ్యా పెద్దకాపుగారూ!—ఎందుకు వచ్చిన రభస? ఈ రాత్రి మిమ్మల్ని తీసుక వెడతాం, రండి. మీకు కావలసినంత సంపద మీరూ తెచ్చుకోవచ్చు' అని చెప్పి సముదాయించాడు.

పెద్దకాపు వప్పుకొని, ఆరాత్రి వాళ్లతో కూడా ప్రయాణమయ్యాడు. వాళ్లతోపాటు మంగలీ వెంటబడాడు. ఇదివరకులాగానే చాకలి మంత్రదీపం వెలిగించి చేత పట్టుకోగానే, ఆ వెలుగున బ్రాహ్మడు

మంత్రం చదువసాగాడు. అక్కడ యక్షుణ్ణి చూడగానే పెద కాపూ, మంగలీ హడిలి పోయారు. 'మీరిద్దరూ పోయి సొమ్ము తీసుకరండి. ఎవళ్ళూ రాకుండా మేమిక్కడ కాపలా వుంటాం' అన్నారు.

అలవాటుపడ్డ బ్రాహ్మడూ, చాకలీ గర్భ మని లోపలికి పోయి, నలుగురికి సరిపడ్డ నాణేలూ, హారాలూ మూటకట్టారు.

ఈలోగా, బయటనున్న మంగలి పెద్ద కాపుతో 'బాబూ!—సొమ్ముతో బయటికి వచ్చాక, తాటాకుకూడా మనమే లాగి వేయాలి!' అని సలహాచెప్పాడు.

'అదే నేనూ అనుకుంటున్నాను. వీళ్ళ భరతం పట్టటం ఎంతసేపులే. అంతా నాచేతిలో పని!' అన్నాడు, అహంకారంతో పెద్దకాపు.

ఇంతలో, బ్రాహ్మడూ, చాకలీ బయటకు వచ్చి 'ఇవిగో మీ వాటాలు' అంటూ, వాళ్ళుతెచ్చిన మూటలలోవి కొన్ని తీసి యిచ్చారు. అందులో లక్షల విలువగల మణులూ మాణిక్యాలూ ఉన్నా, మంగలికీ పెద్దకాపుకీ చాలదనే అనిపించింది. 'ఇంతేనా అక్కడ వున్నది?' అని అడిగాడు కాపు.

'ఇంతేమిటి, అంతేమిటి? దీనికి వెయ్యి రెట్లున్నది ఆ బ్రహ్మాండమైన బిందెలలో. అదంతా తేవటానికి ఎవరివల్ల నవుతుంది?' అన్నాడు బ్రాహ్మడు.

'తేలేకపోవడమేమిటి? మేంతెస్తాం ఉండ వయ్యా!' అంటూ, పెద్దకాపు మంగలిని వెంటబెట్టుకువెళ్ళి పర్వతద్వారం ప్రవేశించి, ఈమారు ధైర్యంతో మెట్లుదిగి వెళ్ళాడు.

వాళ్ళిద్దరూ అలా లోపలికి ప్రవేశించారో లేదో, పెద్ద గాలివచ్చి, మంగలి చేతిలోవున్న దీపం కాస్తా ఆరిపోయింది. దీపం ఆరిపోవ టంతో కొండద్వారం మూసుకుపోయింది.

శాస్త్రుల్లు ఆశ్చర్యపోయి చాకలితో, 'చూశావుత్రా, అబ్బీ, వీళ్లు అత్యాశకు పోతే యేమయిందో? ఇది మనకీ ఒక గొప్ప పాఠమే!' అంటూ, వాడిని వెంటబెట్టుకుని యిలు చేరుకున్నాడు.



# అట్టచివరి బొమ్మ

ముగ్గురిలోనూ కడసారివాడైన కృపాసేనుడు క్షణమైనా వ్యర్థంచేయక, ఉత్సాహంతో సాగిపోయాడు. దేశదేశాలు సంచారంచేశాడు. దిగినచోటల్లా చిన్నారి కుక్క బొమ్మ ఎక్కడ దొరుకుతుందా అని ఆత్రంతో వాకబుచేయసాగాడు.

మాటమంచితనంవల్ల, వెళ్ళినచోటల్లా అతనిని ప్రజ ఎంతగానో ఆదరింపజొచ్చారు. వాళ్ళవాళ్ళవద్ద ఉండే చిన్నారికుక్కలన్నిటినీ తెచ్చి కృపాసేనునికి ఇచ్చారు. వాటిల్లో కొన్ని కుక్కలు అతని జేబులో పట్టేటంత చిన్నవిగా ఉన్నవి. కృపాసేనుడు అంతటితో తృప్తిపడి ఊరుకోలేదు. ఇంకా చిన్నదిగా ఉండే కుక్కకోసం దేశాలన్నీ గాలించుతూనే వున్నాడు.

కృపాసేనుడు ఇలా సంచారంచేసేటప్పుడు అనేకమంది రాజులూ, రాజాధిరాజులూ అతని అందమూ మంచితనమూ చూచి 'మా అమ్మాయిని పెళ్ళిచేసుకో' మంటూ బలవంతం చేస్తూవచ్చారు. కానైతే,–అతను తన కార్యసాధనగురించే పట్టుదల కలిగివున్నాడు. ఈ గొడవలు ఏవీ పట్టించుకొనేవాడేకాదు.

తండ్రి పెట్టిన ఏడాదికీ ఇక మూడు నెలలుమాత్రమే వున్నది. గడువు ఎంతో లేదుకదా అనే ఆత్రంతో కృపాసేనుడు ఇంకా దీక్షతో ప్రయాణం సాగించాడు.

పోయి పోయి ఒక అందమైన దేశం ప్రవేశించాడు. అదంతా మహారణ్యం. ఇందుకు తోడు, అకస్మాత్తుగా గాఢమైన మబ్బులు కమ్ముకువచ్చి ధారాపాతంగా వర్షింపసాగింది. వానలో అతనూ తడిసిపోయాడు. గుర్రమూ తడిసిపోయింది. ఏం చేదామా అని తలచేటంతలో అల్లంతదూరాన మినుకు మినుకుమని ఒక చిన్న వెలుగు కనిపించింది.

ఇది చూచి కృపాసేనుడు పరమానందభరితుడైనాడు. ఆ వెలుగువద్దకు మెల్లగా వెళ్ళిచూస్తే అది ఒక అద్భుతమైన భవనం! ఆ భవనానికి చుట్టుపక్కల కాపలావాళ్ళు ఎవళ్ళూ లేరు. కృపాసేనునికి ఆశ్చర్యమయింది. ఆ కటికచీకటిలో చిత్రమయిన ఒక పన్నెండు హస్తాలు కనిపించినై. అవి వెలుగుతున్న తలకొక దీపమూ పట్టుకుని వున్నయి.

మరికొన్ని చేతులు వచ్చి అతనిని భవనంలోపలికి తీసుకపోయి, సమస్త సదుపాయాలూ అమర్చినై. ఇంకా కొన్ని హస్తాలు వచ్చి అతని గుర్రాన్ని తీసుకపోయి, ఎంతో పొందికగా అశ్వశాలలో కట్టివేసినై. మనుష్యులు చేసినట్టుగానే ఈ హస్తాలు అన్నిపనులూ నెరవేరుస్తున్నయి. ఈ యేర్పాటులకు కృపాసేనుడు ఎంతగానో విస్తుపోయాడు.

# ఇది చేయటం నీవల్ల అవుతుందా?

[1] దిగువనున్న బొమ్మ చూడు. అందులో ఆరు గళాసులు వరసగా నిలబెట్టబడి వున్నాయి. వాటికింద ఒక్కొకదానికి అంకెలుకూడా వేసి ఉన్నాయి. తరువాత – 2-వ గ్లాసులోనూ, 4-వ గ్లాసులోనూ, 6-వ గ్లాసులోనూ సగంవరకూ పానీయం నింపబడి



వుంది. పోతే, 1, 2, 3, నంబర్లుగల గళాసులు ఖాళీగా వున్నాయి. అనగా ఒక ఖాళీగ్లాసూ, దానిపక్కనే ఒక నిండుగ్లాసూ—మళ్లా అలానే ఇంకొకజత, ఇంకొక జత అమర్చివున్నాయి కదా! ఇప్పుడు—ఒక గ్లాసుమాత్రం కదిపి, ఖాళీగళాసులు మూడూ ఒకప్రక్కకూ, నిండుగళాసులు మూడూ ఒకప్రక్కకూ వచ్చేలాగ చెయ్యగలవా?

*　*　*　*　*　*

[2] మామూలు పంచదార గెడ్డను నీకు ఇస్తే, దానికి నిప్పు ముట్టించి దీపం వెలిగించ గలవా? మీకు సాధ్యంకాకపోతే తిప్పిచూడు.



---

[1] ఎలా చెయ్యటం? 2-వ గళాసు తీసుకో, దానిలోని పానీయాన్ని 5-వ నంబరు గళాసులో వంచేసి, దాన్ని మళ్లీ ఎప్పటిచోటున పెట్టివెయ్యి. ఇప్పుడు చూడు.

[2] ఎలా చేయటం? సిగరెట్టు కాల్చగా వచ్చే బూడిద కొంచెం తీసికో. గెడ్డకట్టిన పంచదారను తెచ్చి, దాని కొసకు ఆ సిగరెట్టు బూడిద బాగా అంటుకునేటట్టు చెయ్యి. అలా బూడిద అంటుకున్న ఆ కొసకు అగ్గిపుల్ల వెలిగించి ముట్టించు. ఏమీ కష్టం లేకుండా, ఆ కొస, ముందు మెల్లగా మండి, తరువాత దీపంలాగానే చక్కగా వెలిగి, ప్రకాశిస్తుంది.




అనగనగా ఒక వూళ్ళో కాళీ కంకాలమ్మ అనే మంత్రకత్తె ఉండేది. ఆ మంత్రకత్తె కుక్కలను మేకపోతులుగానూ, మనుషులను మానులుగానూ మార్చివేస్తుందని అందరూ అనుకునేవారు. అలా మార్చివేసిన మేకపోతుల్ని ఆ మానులతో వండి, రోజూ ఆరగిస్తుందని వాడుక.

ఈ సంగతి ఒక రాక్షసుడికి తెలిసింది. 'ఇటువంటి విపరీతపు తిండి తిని, హరాయించుకోగల ఈ కంకాలమ్మ రక్తం ఎంత రుచిగా వుంటుందో కదా!' అనుకొన్నాడు. ఇందుకోసం దానిని తన పాతాళానికి తీసుకపోవాలని నిశ్చయించాడు.

నిశ్చయించి, వాడు ఒక రాజకుమారుని వేషంతో కంకాలమ్మ ఇంటికి వచ్చాడు.

"కంకాలమ్మా! కంకాలమ్మా! నిన్ను గురించి లోకంలో అబ్బురంగా చెప్పుకోగా విన్నాను. నీ అందాన్నిచూసి నేను పెళ్లాడా అనుకుంటున్నాను. మరి, ఏమంటావు?" అని అడిగాడు.

కంకాలమ్మ తన బోసి నోరు తెరిచి, హి-హి-హ్హీ!" అంటూ పెద్ద నవ్వు నవ్వింది.

నవ్వి, 'అవుతే, నీవుద్దేశం బాగానే వుంది. కాని, నన్ను నువ్వు మీ వూరు తీసుకెళ్లగలవా?' అని అడిగింది.

'దానికేముంది? నా వీపుమీద ఎక్కు. క్షణంసేపట్లో మాపట్నం చేరుస్తా'నన్నాడు వాడు గంభీరంగా.

"సరే! కానీ..." అంది కంకాలమ్మ.

కంకాలమ్మని రాక్షసుడు వీపు మీదికి ఎక్కించుకున్నాడు. తరువాత ఒక్క మూడడుగులు వేశాడు. భూమిని ఒక్క తన్ను తన్నాడు. భూమి బద్దలై, పాతాళానికి దోవ కనబడింది.

రాక్షసుడు పాతాళానికి దారి తీశాడు. ఐతే, ఎంత ప్రయత్నించినా, ఎన్నాళ్లు

వి. మందేశ్వరరావు - వేగేశ్వరపురం



నడిచినా, కంకాళమ్మను కింద దింపటానికి గాని, పడవేయటానికిగాని వాడికి శక్య మయింది కాదు.

దాంతో ఆ రాక్షసుడి ఆశలన్నీ తలకిందు లైనాయి. "ఈ పిశాచం వదిలిపోతే చాలురా బాబూ!" అనుకున్నాడు.

వాడు పోయిపోయి, బ్రహ్మరాక్షసుడితో మొరపెట్టుకున్నాడు: 'ప్రభూ!—ఈ దిక్కుమాలిన కంకాలి నా వీపుమీదినుంచి దిగి పోయే వుపాయం చెప్పండి!' అంటూ.

"అబ్బాయీ!—ఈపాటిదానికే భయపడి పోతున్నావా? అలా భయపడటం మన జాతికే తలవంపు. ఇంతకూ, ఇందులో ఏముంది గనక! ఎక్కడినుంచి తీసుకు వచ్చావో, దీన్ని అక్కడే విడిచెయ్యి" అంటూ, బ్రహ్మరాక్షసుడు రహస్యంగా సలహా చెప్పాడు.

కంకాలమ్మ పీడ వదుల్చుకోవటానికని రాక్షసుడు తిరుగుముఖం పట్టి వెళుతూ వుంటే, దారిలో ఒక వెర్రిగొల్లడు కనబడి, నవ్వుతూ—

"బలే! ఈ గాడిదబరువు ఎన్నాళ్లనించి మోస్తున్నావయ్యా, నాయనా?" అన్నాడు వెటకారంగా.




రాక్షసుడు తుళ్ళిపడి: "వీడెవడో దేవాంతకుడులాగావుంది. నేను ఈ ముసలి దాన్ని ఇన్నాళ్లనుంచీ మోసుకు తిరుగుతున్నానని వీడికెలా తెలిసిందో!" అని అనుకుని,'బాబ్బాబు! నాకి కాస్త ఉపకారం చేసి పెడుదూ!" అంటూ, తన బాధ కాస్తా బయటపెట్టాడు.

"ఓస్, దీనికేముంది? నా వీపుమీదికి ఎక్కించవయ్యా!" అన్నాడు వెర్రిగొల్లడు.

'బ్రతుకు దేవుడా!' అనుకుని, ముసలి కంకాలిని గొల్లవాడి వీపుమీదికి ఎక్కించాడు రాక్షసుడు. వెంటనే గొల్లడు దక్షిణ దిక్కుగా పరుగెత్త నారంభించాడు.



'ఆ ముసిలిది వదిలేదేమిటి, యింక ఈ వెర్రిగొల్లడు తిరిగి వచ్చేదేమిటి!' అనుకొని, రాక్షసుడు గొల్లవాడి గొర్రెల మందను మళ్లించుకు పోబోయాడు.

రెండడుగులు వేశాడో లేదో, గొల్లవాడు ఎదుట సిద్ధమయ్యాడు!

"ఏం, మావా? ముసిలిదాన్ని నాకు వప్పగించేసి, నా గొర్రెలమందను మళ్ళించుక పోదామనుకుంటున్నావా?' అన్నాడు మళ్ళీ నవ్వుతూ, ఆ గొల్లడు.

ఆ మాట వినిపించుకోనట్టుగా నటిస్తూ, రాక్షసుడు 'ఐతే, ఆ పిశాచిని ఎలా వదుల్చుకున్నావురా అబ్బి!' అని అడిగాడు.

'దానికేముంది! ఈ పక్కనే దిక్కుమాలినవాళ్లు పడిచచ్చే చెరువొకటి ఉంది. దాంట్లో పడవేసివచ్చా. దండుముండ, నా గొంగళి పట్టి ఎంతకూ వొదిలిందేకాదు. పోతేపోయిందని, ఆ గొంగళీకూడా చెర్లోనే వదిలేసి వచ్చా!' అన్నాడు, గొల్ల.

గొల్లవాడు చేసిన ఉపకారానికి సంతోషిస్తూ, రాక్షసుడు వానితో 'అబ్బాయీ!– నువ్వు ఒక పని చెయ్యి. నేను ఈ దేశపు రాజుగారి కూతురుని ఆవహిస్తాను. ఆ అమ్మాయికిక మాటామంతీ, చూపూచేతా లేకుండా చేస్తాను. సరిగ్గా ఇవాళకు ముప్పయ్యొకటో రోజున వచ్చి, నువ్వు రాకొమార్తె చెవిలో 'నే గొల్లోణ్ణి పిల్లా!' అను. అంతే. నే నామెను వదిలేసి పోతా. ఆమీద మరి. నీకు పట్టబోయే సిరి యెటువంటిదో నీవే ఆలోచించుకో!' అని చెప్పాడు.

సరేనని గొల్లవాడు బయల్దేరాడు. పట్నం వెళ్లేటప్పటికి, ఎక్కడచూచినా ఇదేగొడవ! "రాజకుమారికి మాట పడిపోయింది. నెల అయింది. బాగుచేసినవాళ్లకి అర్ధరాజ్యమూ, పిల్లనూ ఇచ్చి పెళ్లిచేస్తారట!" అని.

గొల్లవాడు కోటవద్దకు వెళ్ళేటప్పటికే అనేకమంది రాజవైద్యులూ, భూత

వైద్యులూ, పెదవి విరిచి బయటకు వచ్చే స్తున్నారు. గొల్లడి వేషంచూసి అందరూ అసహ్యించుకున్నా, వైద్యుని హోదాలో రావటంచేత లోపలికి వెళ్లనీయక తప్పిందికాదు.

గొల్లడూ దర్జాగా, ఠీవిగా, ధైర్యంగా వెళ్లాడు. మంత్రాలూ, తంత్రాలూ ఆట్టహాసం చేశాడు. చివరకు రాక్షసుడు చెప్పిన తిరు మంత్రం చెప్పాడు రాకుమారి చెవిలో.

ఆమెను ఆవహించిన రాక్షసుడు రాకుమార్తెను వదిలేస్తూ గొల్లనితో అన్నాడు. "ఇదుగో, ఇదే ఆఖరుసారి! ఇటువంటి వైద్యం మరెవ్వరికైనా చేశావంటే నీ పుర్రె పగులుతుందిసుమా, జాగ్రత్త!" అంటూ హడల గొట్టాడు.

రాజకుమార్తె వెంటనే లేచికూర్చుని, కిలకిల నవ్వటానికి ప్రారంభించింది. కోటలో మంగళవాద్యాలు మోగినాయి. వెర్రిగొల్ల ఆ రాజ్యానికి రాజయ్యాడు! ఐతే, కథమాత్రం అప్పుడే కంచికి పోలేదు.

* * *

రాక్షసుడు తన అలవాటుప్రకారం పోయి ఇంకొక పొరుగురాజు కూతురును పట్టి ఇలాగే పీడింపసాగాడు. ఆమెకు కూడా




పాపం! మాటా మంతీ, చూపూ చేతా లేకుండా పోయినై.

ఆ మహారాజు ఎన్నోవైద్యాలు చేయించి, మంత్రాలు వేయించాడు. లాభం లేక పోయింది. చివరకు, మన గొల్లరాజుగారి పూర్వకథ విని, ఆయనకు కబురుచేశాడు.

కబురు అందగానే గొల్లవానికి కంగారు పుట్టింది. ఆ రాజకుమారిని వదిలిపోతూ, చిట్టచివర రాక్షసుడు చెప్పిన మాటలు జ్ఞాపకానికి వచ్చినై.

రావటంతోనే, పొరుగురాజుతో 'అయ్యా! నేను మాంత్రికుణ్ణికాదు, తాంత్రికుణ్ణికాదు. వైద్యుణ్ణి అసలే కాను. ఏదో వరప్రసాదం

వల్ల ఆ రాజకుమారిని మాత్రం బాగుచేయ కలిగాను. ఆ మంత్రపటిమ అంతటితోనే పోయింది. కనుక, నావల్లనేమీ కాదు" అని సమాధానం చెప్పాడు.

ఈ మాటలు వినిపించుకోకుండానే, 'మా కోరిక నెరవేరిస్తే సరే సరి. లేకుంటే యుద్ధానికి సిద్ధంగా ఉండు' అని రాయబారం పంపాడు పొరుగురాజు.

గొల్లరాజు సందిగ్ధంలో పడి, చివరికి 'సరే, ఏమైతేకానీ, చూదాం' అని బయల్దేరాడు.

కోటలోకి వెళ్ళాడు. మునపటిలాగానే మంత్రాలూ తంత్రాలు మొదలైన అట్టహాసాలు అన్నీ చేశాడు. రాజకుమారి చెవులో, గింగురెత్తేలా ఇలా చెప్పాడు:

'అబ్బాయ్! యిదుగో, నే చెప్పే ఈ మాటలు రెండూ జాగర్తగా విను—అనాడు మనం చెర్లో పడవేసిన కంకాలి చస్తుందనుకున్నాము. కాని అది చావలేదు. బతికి పైకి వచ్చిందట! నిన్ను వెతుక్కొంటూ బయల్దేరి వస్తూందిట. ఊరిపొలిమేరవరకూ వచ్చివుంటుందని చెప్పుకొంటున్నారు. నువు నాకు ఉపకారంచేశావుకదా అని, ఈమాట ముందుగా నీకు చెప్పవచ్చా'...

గొల్లరాజు చెప్పటం పూర్తిచేయనేలేదు. 'కంకాలమ్మ' అనేమాట చెవినిపడటంతోనే ఆ రాకసుడు 'బాబోయ్!' అని ఒక్క కేక వేసి, పాతాళానికి దౌడుతీశాడు!

ఇంకేముంది!—రాకసుడు ఎప్పుడైతే పరుగుచ్చుకొని, వదిలిపోయాడో, ఆ క్షణమందే రాకుమార్తె తన చారెడేసి కళ్లను తెరిచిచూసి, దానిమ్మగింజల్లాంటి పండ్ల వరుస కనబడేటట్టు నవ్విందట! కూతురుకు నయమయిందనగానే వాగ్దానం ప్రకారం, మహారాజు ఆమెను గొల్లరాజుకిచ్చి అతి వైభవంగా పెళ్లిచేశాడు.

ఈవిధంగా, అదృష్టవంతుడైన గొల్లరాజు ఇప్పుడు ఇద్దరు రాణులకు భర్త ఐనాడు!



## బదులు చెప్పు

1. ఢిల్లీనగరానికి పూర్వపు పేరు ఏమిటి?
   (అ) పాటలీపుత్రం
   (ఆ) ఇంద్రప్రస్థం
   (ఇ) రాజగృహం
2. బౌద్ధమతం అవలంబించిన హిందూ చక్రవర్తి ఎవరు?
   (అ) చంద్రగుప్తుడు
   (ఆ) సముద్రగుప్తుడు
   (ఇ) అశోకుడు
3. ప్రపంచంలోకెల్లా పెద్దజీవం ఏది?
   (అ) హ్వేలుచేప
   (ఆ) ఏనుగ
   (ఇ) జిరాఫీ
4. సంస్కృతంలో ఆదికవి ఎవరు?
   (అ) వాల్మీకి
   (ఆ) కాళిదాసు
   (ఇ) వ్యాసుడు
5. సత్యాగ్రహం ప్రారంభమైంది ఎక్కడ?
   (అ) బీహారు
   (ఆ) దక్షిణాఫ్రికా
   (ఇ) గుజరాత్
6. రేడియో కనిపెట్టిన మార్కోనీ ఏ దేశస్థుడు?
   (అ) బ్రిటన్
   (ఆ) ఫ్రాన్సు
   (ఇ) ఇటలీ

—[58-వ పేజీ చూడు]

## వినోదం

ప్రశ్న: అబ్బాయీ!—ఉష్ణం ఎక్కువగా ఉన్నప్పుడు పెద్దదయి, చల్లగా ఉన్నప్పుడు తగ్గిపోయేది ఏదైనా చెప్పగలవూ, చూస్తా.

జవాబు: ఒస్, ఇదేనా! మహా గొప్ప ప్రశ్న వేశారులెండి. పగటిపూట అనేది ఎటువంటిదో చూడండి. వేసంగిలో పెద్దదై, శీతకాలంలో తగ్గిపోతుంది కదూ?

*　　*　　*

ప్ర: మనం తప్పులు క్షమించుమని భగవంతుణ్ణి ప్రార్థించటానికి ముందు ఏం చేయాలి?

జ: తప్పులు చెయ్యాలి.

*　　*　　*

క్లాసుపాఠాలన్నీ పూర్తిఅయినాయి. అందరూ వెళ్ళిపోయారు. ఒక్క విద్యార్థిమాత్రం క్లాసు గదిలో దిగడి వున్నాడు.

మేష్టరు: ఏమిరా అబ్బాయి, ఇంకా వెళ్లలేదేం?

విద్యార్థి: ఇంటి కెళితే 'ఇవాళ ఏం చదువుకు వచ్చావ్?' అని అడుగుతాడండి మా నాయన. ఏం చెప్పమంటారండీ?

*　　*　　*

శ్రోత: అయ్యా, తమరు చాలా గొప్పగా పాడతారని విన్నాను. ఏదీ, భైరవిరాగం ఒక్కసారి సెలవియ్యండి.

గాయకుడు: ఇప్పుడు పాడింది భైరవేనండీ.

శ్రోత: అలాగా! ఈమాట తెలిస్తే, ఇంకా కాస్త శ్రద్ధగా వినేవాణ్ణి సుమండీ!

## వింత శబ్దం

ఈమధ్యనే న్యూయార్క్ దేశస్థులు, ఒక రోజున మంచి రేడియో ప్రోగ్రాము వున్నట్టు తెలుసుకుని, తమతమ రేడియోసెట్టులను సిద్ధంగా తిప్పిపెట్టుకున్నారు.

వారు అనుకొన్న ప్రోగ్రాము వినబడలేదు సరికదా, "కుర్ర్ర్...కుర్ర్ర్" అనే వింతశబ్దం ఒకటి ప్రారంభమయింది. ఇదేమిటా అని అందరకూ ఆశ్చర్య మయింది. ఎంత కనిపెట్టుకొనివున్నప్పటికీ ఈ వింతశబ్దమే ఎక్కువగుతూవచ్చింది కాని, అసలు ప్రోగ్రాము వినబడనేలేదు.

శ్రోతలు కొందరు కలిసి, ఈ విషయం పోలీసుకు టెలిఫోనులో రిపోర్టు ఇచ్చారు. పోలీసులు వెంటనే రేడియోస్టేషనుకు పోయి చూచారు. తీరా చూస్తే, స్టూడియోలో ఎనౌన్సరు గుర్రుపెట్టి నిద్రిస్తున్నాడట! 'మైక్' ద్వారా అతని గుర్రుశబ్దమే ప్రసారితమయింది! ఈ సంగతి విన్నవాళ్లకు నవ్వు ఆగలేదు.

## ఇది కదా అదృష్టం!

'లూయీ కార్సో' అనే వస్తునిర్మాతకు ఒకప్పుడు చెప్పరాని కుటుంబకష్టాలు వచ్చిపడినై. అతని రెండేళ్ల బిడ్డడికి వచ్చేప్రాణం పోయేప్రాణమున్నూ. భార్యకు ప్రసవవేదన. చేతిలో కర్చుకు కాసు లేకపోయె. ఏంచేసేట్టు?

అయితే – ఇన్నికష్టాలలోనూ, అతనికి మంచి యోచన ఒకటి తట్టింది – యేమిటీ అంటే: అమెరికాదేశంలో 'వస్తునిర్మాతల నిధి' అని వున్నది. వారు అవసరమైనప్పుడు నిర్మాతలకు డబ్బు బదులిచ్చి సాయపడతారు. అక్కడికి పోయి, ఆ నిధినుండి అతడు 560 డాలర్లు బదులు తీశాడు. అతనికి చిక్కులు తీరి డబ్బు సమకూడగానే తను తెచ్చిన అప్పు వడ్డీతోసహా తీర్చివేదామని వెళ్లాడు. కాని, ఆ నిధి ఉద్యోగులు అతనితో 'నీ బాకీ తీరిపోయింది. నిధికి నీ వింక ఏమీ ఇవ్వనక్కరలేదు' అని చెప్పారట. ఏమిటీచిత్రం!

అసలు రహస్యం ఇది: ఆ నిధినుండి అప్పుతీసిన సభ్యులలో, పది లక్షల సంఖ్య పూర్తికాగానే మళ్లీ ప్రారంభమయే సంఖ్యవచ్చిన సభ్యునికి అప్పుతీసిన మొత్తం బహుమతిగా ఇచ్చివేస్తారు. ఇది వారి నియమం. ఇప్పుడు మన 'లూయీకార్సో'కు వచ్చినది అదృష్టవశాత్తు, పదిలక్షలు పూర్తిఐన తర్వాత వచ్చే మొదటి సంఖ్య.

ఈ విధంగా అతను ఋణంచేసిన ధనం బహుమతిగా రావటంతో, కాసు కూడా చెల్లించనక్కరలేకుండానే బాకీ తీరిపోయింది!

# గబ్బిలానికి చీకటిలో తోవ ఎలా తెలుస్తుంది?

అనేకమైన జంతువులూ, పక్షులూ రాత్రిపూట సంచరిస్తూ వుండటం మనకు తెలుసు. చీకటిలో సంచరించే పక్షులలో గబ్బిలం ఒకటి. అది దాదాపు 60,000,000 కోట్ల సంవత్సరాలనుంచీ ఇలా చీకటిలోనే మసులుతున్నదని శాస్త్రజ్ఞులు కనిపెట్టారు. అయితే, ఇది ఎలా సాధ్యం?—వినండి:

'రాడార్' అనే యంత్రం రేడియోతరంగాలద్వారా వచ్చేపోయే విమానాలను కనుక్కొంటుంది. తరంగాలు సూటిగా పోతూనేవుంటాయి. కాని, తోవలో ఏదైనా వస్తువు తగిలినట్టయితే అవి మరలి వచ్చేస్తాయి. అప్పుడు వచ్చే ప్రతిధ్వనినిబట్టి, ఆ వస్తువు ఏమిటో అది చెప్పగలుగుతుంది.

అలాగే—గబ్బిలంకూడా, సూక్ష్మస్వరం కలిగిన శబ్దతరంగాలను వరసగా వదులుతుంది. వీటినే 'రాడార్ సిగ్నల్స్' అంటారు. ఇవి మనకు వినిపించ నంతటి సూక్ష్మంగా వుంటాయి. అతివేగంగా పయనించే ఈ తరంగాలు గబ్బిలం ఎగిరే ప్రదేశాన్నంతటినీ నింపివేస్తాయి. మధ్యలో వాటికేదన్నా వస్తువు తగిలితే—అది ఎంత చిన్నదైనాసరే, హెచ్చరికగా సిగ్నల్సు తిరిగి వస్తాయి. అప్పుడు గబ్బిలం తన ప్రయాణపు దిక్కును గభిమని మారుస్తుంది.

గబ్బిలాలు తోవ కనుక్కోవటానికి కంటిచూపు మీద ఆధారపడి ఉండవనీ, కళ్ళకు గంతలు కట్టినప్పుడుకూడా అవి మామూలుగానే ఎగరగలవనీ, విజ్ఞాన వేత్తలు శాస్త్రరీత్యా రుజువుచేశారు.

కానైతే చెవులూ, నోరూ మూసివేస్తే అవి బొత్తుగా ఎగరలేకపోయినై. దీనినిబట్టి, తోవ కనుక్కోవటానికి అవి ఏవో శబ్దాలు వినవలసివున్నదని, తేల్చుకొన్నారు.

గబ్బిలం ఎగరబోయే ముందు సెకనుకు పదిచొప్పున రాడార్ సిగ్నల్స్‌వంటి శబ్దాలు వదలటం మొదలుపెడుతుందట. ఎగరటం మొదలుపెట్టగానే, ఇటువంటి శబ్దాలు సెకనుకు 30 చొప్పున వదులుతుందట. హెచ్చరికగా ఏదైనా ప్రతిధ్వని తిరిగివచ్చిందంటే, ఈ శబ్దాలు సెకనుకు 50 చొప్పున వదలబడతాయి. ఈ శబ్దాలు ఎంత ప్రబలంగా వుంటే ప్రతిధ్వనికూడా అంత ప్రబలంగానూ వుండి, తోవలో ఏ వస్తువున్నదీ, గబ్బిలానికి తేలికగా తెలుస్తుంది. తక్షణమే అది తోవ మార్చేసి, ఆ వస్తువును తప్పించుకుని ఎగిరిపోగలుగుతుంది.

*

ఒంటిగీత బొమ్మ



పంపినవారు:
సి. హెచ్. హనుమాయమ్మ - గూడూరు

56 — పేజీలోని 'బదులుచెప్పు' ప్రశ్నలకు జవాబులు:

1. ఆ — ఇంద్రప్రస్థం
2. ఇ — అశోకుడు
3. అ — హ్వేలుచేప
4. ఇ — వ్యాసుడు
5. అ — దక్షిణాఫ్రికా
6. ఇ — ఇటలీ

# ఫోటో వ్యాఖ్యల పోటీ

## మార్చి ఫొటోల ఫలితాలు



మార్చినెల చందమామలో ప్రచురింపబడే ఫొటోలకుగాను, మాకు వచ్చిన వ్యాఖ్యలలో ఉత్తమంగా వున్న ఈ దిగువ వ్యాఖ్యలకు బహుమతి యివ్వడమైనది.

వ్యాఖ్యలు:

మొదటి ఫొటో: లేమి బాధ

రెండవ ఫొటో: కలిమి గాథ

పంపినవారు:

ఆర్. లక్ష్మినారాయణ

1/5 అర్ముగచెట్టివీధి, ట్రిప్లికేన్, మదరాసు - 5

బహుమతిపొందిన ఈ వ్యాఖ్యలు, పంపిన వారి పేరుతోసహా మార్చి చందమామ ఫొటోల దిగువని ప్రచురిస్తాము. బహుమతి మొత్తం రూ. 10/- మార్చి సంచిక వెలువడిన వెంటనే పంపబడుతుంది.



## ఏప్రిల్ నెలలో

ప్రచురింపబడే ఫొటోల నమూనాలు వివరాలతోసహా ప్రక్కపేజీలో చూడండి.

ముఖ్యసూచన:

వ్యాఖ్యలను ప్రక్కపేజీలోని కూపన్‌లోనే పూర్తిచేసి పంపాలి. పూర్తిచేసిన కూపన్‌ను బుక్‌పోస్టులో పంపవచ్చు. ఇందుతో ఎటువంటి జాబులను జతపరచకూడదు.

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1953 ఏప్రిల్ సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై రెండు ఫొటోలకూ సరిఐన వ్యాఖ్యలు కావాలి. వ్యాఖ్య ముచ్చటైన ఒక్క మాటలో గానీ, చిన్నివాక్యంలోగానీ ఉండవచ్చు. మొదటి ఫోటోకూ రెండవ ఫోటోకూ వ్యాఖ్యలు సంబంధం కలిగివుండాలి.

★ ఫిబ్రవరి 15-వ తేదిలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ దిగువ కూపన్‌లో వ్యాఖ్యలు రెండూ పూర్తి చేసి, ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటోవ్యాఖ్యల పోటీ, మద్రాసు - 26.

★ చందమామ కూపన్లలోగాక, ఇతర విధముల పంపే వ్యాఖ్యలు పోటీకి పనికిరావు.

→ చందమామ ఫోటోవ్యాఖ్యల పోటీ కూపన్ ←

మొదటి ఫోటో
వ్యాఖ్య ..........................................

రెండవ ఫోటో
వ్యాఖ్య ..........................................

పంపినవారి పేరు ..........................................

పూర్తి చిరునామా ..........................................

Apr '53

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras 26 and Published by him from Chandamama Publications, Madras 26, Controlling Editor: SRI CHAKRAPANI

Photo by T. Kasinath



బహుమతి
పొందిన వ్యాఖ్య

మోక్షపు బాట

పంపినవారు:
అద్దంకి వెంకటేశ్వరరావు - ఏలూరు

